# భేష్

మహా మంచిపేరయ్యా నీది, నీలకంఠం! గిరీశం, 
తీశం, నీలకంఠం — మీరు ముగ్గురూ ఆంధ్ర వాఙ్మయ సృష్టి
విచిత్ర ప్రకృతులు! మీలో గిరీశం పూర్వకాలపు మ
ఎంతసేపూ అతని లోకం మరమ్మత్తంతా వేశ్యలమీ
పితంతువులమీదాను. పార్వతీశం ఇంకా కుర్రాడు. అ
దేశాన్నుద్ధరించడానికి ఎందుకేనా మంచిదని ఇంగ్లండు
వచ్చిన ప్రబుద్ధుడు! ఇంక నువ్వో, కార్యశూరుడివి! స
గ్రహ సమరంలో దూకిన సాహసుడివి. మంచి సంస్కారా
సంపాదించావు. గౌరవప్రదమైన ప్లీడరీవృత్తి, అందమైన
వాళ్ళను కూడా ఆకర్షించే రూపురేఖలూ ఉన్నాయి నీ
ఏనా... ...

నీ కథ ఏది చదివినా మహా హుషారుగా ఉంటుంది ; కా
Climax దగ్గిరికి వచ్చేసరికి మనస్సు చివుక్కు మంటుంది. అ
నీ లోటు కాదనుకో! ఈ ఆడవాళ్లున్నారే — “క్షణక్షణముల
జవరాండ్ర చిత్తముల్” అని ఊరికే అన్నాడుటో
మహాకవి ?

తరుణుల తత్త్వమే తమషాఐంది. ఎలాంటి నీతిమంతుణ్ణయినా
ముందు రెచ్చగొడతారు. కొంతకథ నడిచి, తీరా మంచిపట్టు
లోకి వచ్చేసరికి నల్లగా జారిపోతారు. ఇంకా మీదికి వ
ఏ రిపోర్టో చేసి తప్పించుకుంటారు ఎండమావుల్లాగ ఆ

పెడుతూనే అందకుండా పోతారు, కొందరు; కొందరు చేతికి దొరికీ కూడా దాటుకు పోతారు; అలా అని నిరుత్సాహ పడకేం! "ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై, ప్రారబ్ధార్థము ఉజ్జగింపరు సుమీ!" అసలు నువ్వు కథల్లోనే గాని లేవనుకున్నాను. మొట్టమొదట. కాని... చూడగా చూడగా, "ఇందుగల డందులేడని సందేహము వలదు" అన్న ప్రహ్లాదుడి దేముడిలాగ నువ్వు ఎప్పుడు పడితే అప్పుడు, ఎక్కడచూస్తే అక్కడ కనబడతావోయ్—చదువుకునే కుర్రవాళ్లలో, కచ్చేరీలకు పోయే గుమాస్తాలలో, జట్కాబండ్లల్లో, కార్లలో, ఊరేగే పెద్దమనుష్యులలో, రికామీగా తిరిగే యువకులలో, నీతిగురించి ఉపన్యాసాలిచ్చే పండితులలో...

అన్నట్టు, నీతిఅంటే జ్ఞాపకంవచ్చింది. Ethics గాని **Psycho—Analysis** గాని తెలియని చాలామంద మన సనాతనకవులలోను, వృద్ధపండితులలోను-ఈ నీతిబాధవిపరీతంగాదు. ప్రబలిపోతోంది. నీ మీద దండెత్తాలని చూస్తున్నారు, నిన్ను సరిగ్గాగ్రహించు కోకుండా. నువ్వు ఖాతర్ చెయ్యవులే!

నీసంగతి ఏది చూచినా ఒకనీతీ, నియమమూ కనబడతాయి. నువ్వు శ్రీశుకుడు, వివేకానందుడూ లాంటివాడవు కావు. కాని పొదలో ఉన్న పులివి. ముందుగా ఒకరిజోలికిపోవు. గాని మీద రాయి విసిరితే ఊరుకోవు. రంగంలోకి ఒక్కసారి దూకావా, మరి వెనక్కిరావు—అమీ తుమీ తేలేదాకా.

నీది చాలా ఆరోగ్యతత్వం Sportsman వి కావడం చేత మనస్సులో మాలిన్యం లేదు నీకు. స్నేహితులందరికీ నువ్వంటే ఆదరాభి మానాలు,—సకుటుంబంగా. నీది చాలా విశాల దృష్టి—ఎరిగి ఉన్నంతవరకూ ఎవరూ తప్పు నీదే అని అన లేరు. అలాంటి నిన్నూ, నీ జీవితాన్ని పట్టుకుని అవినీతి—అవినీతి అంటా రేమయ్యా! అయోమయం మనుష్యులు! వాళ్ళకి మతిగానే లేదా? నీతిఅంటే తెలీదా? రెండూ గా?

నీలకంఠ దీక్షితులూ! నువ్వు చాలా అదృష్టవంతుడివి! ఒక మహావిద్వాంసుడు, ఉత్తమకవి నీ గాథలు రచించే భాగ్యం కలిగింది నీకు. ఏక్ దమ్ములో సాహిత్యశిఖరాన్నందు కున్నావు. చక్కని భాషలో, గొప్ప technique తో నీ చర్యలు వ్రాసిన ఆ కథకాచార్యునికి నువ్వే కాకుండా ఆంధ్ర పాఠకలోకం—స్త్రీ పురుషాదులు—యావన్మందీ ధన్యవాదా లర్పించాలి.

భాయ్! ఎంతెంత, ఎన్నిసార్లు నిన్నుగురించి చదివినా ఇంకా చదవాలనే ఉంటుందోయ్! నీ జీవితం ప్రతి ఆంధ్రుడికీ పాఠం కాగుటయ్యా బాగా యోచిస్తే! అయితే సిసలైన తెలుగుబిడ్డలాగుబ్బక వెలుగు వెలిగి చీకట్లో దాక్కో—వుకదా, నువ్వు! మళ్ళీ కనబడతావు కాదూ;

జయ్! నీలకంఠానికీ జయ్!

బెజవాడ
1—9—1939

వింజమూరి శివరామ రావు
మజిలీస్—ఇ—ఉమర్ ఖయ్యాం

# మంచి మనిషి

## ౧

టెన్నిసు సెట్టు పూర్తి చేసి స్నేహితు లిద్దరూ చింత చెట్టుకింది కుర్చీలో ఆనుకుని "రెండు సోడాలు పట్టుకురారా అబ్బాయి!" అని క్లబ్బు జవానుతో చెప్పారు. వాడు తెచ్చిన సోడాలు నెమ్మదిగా తాగుతూ, రంగారావు వెంకట్రావుతో "నువ్వు రాత్రి కౌసల్యాగా రింటికి భోజనానికి రావా?" అన్నాడు.

"నాకూ ఆహ్వానం వచ్చింది. అయితే ఇంట్లో కొం[illegible] అసందర్భంగా వుండటంవల్ల బహుశా రానేమో అనుకుంటాను" అన్నాడు వెంకట్రావు.

"అసందర్భ మేమిటి? భోజనం చేసి వెళ్ళగూడనూ ఇంటికి? రామారావు నువ్వు రాకపోతే ఏమన్నా అనుకుంటాడు. అసలే తప్పులు పట్టే మనిషి. నువ్వు రాకపోతే నేనుకూడా వెళ్ళను. ఏమిటో ఆయన పిల్చాడనిగాని వాళ్లిళ్ళకీ, వీళ్లిళ్ళకీ భోజనాలకి వెళ్ళడం అంటే నా కంతగా మనస్కరించదు."

"ఆయన్ని చూసి కాదోయ్! ఆవిడ దేవో మంచిది స్త్రీసమాజంకోసం పాటుబడుతూ వుంటుంది. దివ్యజ్ఞాన సమాజంలో బాగా వుపన్యాసం చెప్పింది. ఎంత బాగుంది. ప్రార్థన

సమాజంలో పాట లెంత బాగాపాడుతుంది! కాంగ్రెసు మీదకూడా గాఢాభిమానం. మనం వెళ్ళకపోతే ఆవిడేమన్నా అనుకుంటుంది, పాపం!"

"ఓ! ఆవిడమంచిని చూసిటా నువ్వు వచ్చేది? అంత మంచిదేం? నీకుమట్టుకే కనబడేలా వుంది ఆవిడమంచి!"

"రంగడూ! నువ్వు ఎప్పుడూ ఎవర్నో వకర్ని వెక్కిరిస్తూనే వుంటావురా! స్త్రీలు కాస్త బయటికి వచ్చి ఆ వుద్యమంలోనూ, ఈ వుద్యమంలోనూ పాల్గొన్నంత మాత్రాన మంచితనాని కేం లోటొస్తుందేం? ఆడవాళ్ళను పరదా వెనకాలనే వుంచాలంటావా?"

"అది కాదు. ఈ రోజుల్లో అబ్రాహ్మణ స్త్రీలకు ర్యాలు [illegible] ...దా పోయి, మన బ్రాహ్మణస్త్రీల నెత్తిన పడ్డది. అయినా, స్త్రీలు కొంచెం హద్దులో వుండటమే మంచిదనుకుంటాను."

వెంకట్రావు నవ్వి "హద్దుల్లో వుంచడం అంటావు? హద్దుకు హద్దెక్కడ? మంచివాళ్లు నాలుగుచోట్లకూ వస్తూ వున్నా చెడిపోరు. చెడిపోయేవాళ్ళు ఎక్కడ వున్నా చెడిపోతారు!" అన్నాడు.

"అదిగా దబ్బాయి! ఈవిడ నర్సారావుపేటలో వున్న రోజుల్లో ఏదో గ్రంథం చేసిందని వాడుక. అందుచేత_"

రంగారావుమాటలు పూర్తికాకుండానే వెంకట్రావు అడ్డుతగిలి, "నీవు మంచిదన్న ఆడదాన్ని ఒక్కతెను చూపించు? నీకు లోకమంతా చెడుగానే కనబడుతుంది. ప్రతి

వాళ్ళకూ ఏదో గ్రంథం ముడిపెడతావు. చాల్లెస్తూ నీ మా-
టలు!" అన్నాడు.

రంగారావు సిగరెట్టు వెలిగించి వలయాకారంగా పొగ విడుస్తూ "నువ్వు పట్టి వెర్రివెంకటాయివిరా! వేశ్యలకికూడా పాతివ్రత్యం వుందనే ఘనుడువి! వాత్స్యాయన కామసూత్రాలు చదివావా?" అన్నాడు.

"ఆదినారాయణ శాస్త్రి దేనా? బాగానే వుంది పుస్తకం. ఆ మధ్య ఎప్పుడో చదివాను."

"అసలు పతివ్రత అనేది లేదంటాడు. గమనించావా?"

"వాత్స్యాయనుడికి బుద్ధి లేదు!"

రంగారావు సిగరెట్టుపీసి Ash-Tray లోకి రానవ్వి, "ఋషిని ఇలాగా దూషిస్తున్నావే! నీ దృష్టికి కాగితెన్స వాత్స్యాయనుడు? పాతివ్రత్యం వుండడానికి ఇరవైనాలుగు కారణాలు చెప్పాడు. ప్రథమ కారణం భయం అన్నాడు. దుర్బలమైన కారణం ఇరవైనాలుగోది, ఏమిటో తెలుసా? Chastity for its own sake: పాతివ్రత్యం మంచిది గనుక, పాతివ్రత్యం అన్నాడు.

"ఏడిశావులే! వాడు ఋషి అయితే పెళ్ళి అయినవాడా, కానివాడా? బ్రహ్మచారే గనక అయితే స్త్రీసంగతి వాడికేం తెలుసు? తెలిసిం దంటావా, వాడెంత మంచివాడో కనబడుతూనే వుంది! ఈ పుస్తకాల సంగతి నాకు చెప్పకు, వళ్లు కాలుకొస్తుంది!"

"అది కాదురా వెర్రికుట్టే! శాస్త్రవిషయం కాదు నే నిక్కడ చెప్పదలచుకుంది. నరసరావుపేట సంగతిరా నాయనమ్మా! నమ్మదగ్గమనిషి చెప్పాడు. ఆవిడ మంచి దైతే నా డేం పోయింది."

"మంచిదైతే నీబోటి వాడికి నష్టం!"

"ఇదంతా ఎందుకు? భోజనానికి వెళ్ళడమా. వెళ్ళక పోవడమా?"

"అడుగో! నీలకంఠం వస్తున్నాడు. వాడొస్తే మనం [illegible]డా వెళదాం"

మా[illegible]

[illegible]ాల

కు[illegible]

౨

[illegible]

నీలకంఠం ఊపుతో నడుస్తూ, ముంగురులు సవరించుకుంటూ క్లబ్బుమెట్లెక్కి బిలియర్డు గదిలోకి వెళ్ళబోతూండగా రంగారావు "నీలకంఠం" అని కేకేశాడు. అతను వెనక్కి తిరిగి చూసి, చిరునవ్వుతో మెట్లుదిగి చింతచెట్టుకిందికి వచ్చి, కుర్చీ రంగారావు దగ్గరగా లాక్కుని కూర్చున్నాడు.

"ఏమిరా! మమ్మల్ని చూడకుండానే లోపలికి వెళ్లుతున్నావే!" అన్నాడు రంగారావు.

"చూళ్ళేదురా అబ్బి! ఇప్పుడే వూరినుంచి వచ్చాను. నువ్వు బిలియర్డు గదిలో వుంటావని అక్కడికే వెళుతున్నాను."

"ఎక్కడినుం చేమిటి వస్తున్నావు ?" అన్నాడు వెంకట్రావు.

"నర్సారావుపేట నుంచోయ్!"

"ఓహో! నర్సారావుపేటనుంచా ? అయితే భోజనానికి రావు రాత్రికి ?" అని రంగారావు అడిగాడు.

"భోజనానికా ? ఎక్కడికి ?"

"కౌసల్యగా రింటికి."

నీలకంఠం ఫ్రెంచికట్ మీసం దస్తీతో తుడుచుకుంటూ "అవును. మొన్న రామారావు భోజనంమాట ఎత్తాడుసుమా! నేను మరిచిపోయాను. ఏమిటో అక్కడికి పోవడం అంటే మనస్కరించదు. అతన్ని చూస్తే ఏమిటో ఖాయిలా చేస్తుంది!" అన్నాడు.

"రామారావుగాడి మొగం చూస్తే ఖాయిలా చేస్తే ఆవిడ మొగం చూసైనా రాగూడదూ భోజనానికి ?" అన్నాడు రంగారావు.

నీలకంఠం ఒకక్షణం పరధ్యానంగా వుండి "ఆవిడ ముఖం చూసి అక్కడికి వెళ్ళేరోజులు మారిపోయి నైలే" అన్నాడు.

వెంకట్రావు నీలకంఠం కళ్ళల్లోకి చూస్తూ "అదేమిటోయ్ ? రోజులు మారిపోవడమంటా వేమిటి" అన్నాడు.

"నీ కెందుకులే ఇలాంటి సంగతులు శుకమహర్షికి. ఏదో సామాన్యమానవులం, మా గొడవలు నీ చెవిని పడడం అంత మంచిది కాదు!" అని నవ్వాడు నీలకంఠం.

వెంకట్రావుకు కొంచెం సంశయము కలిగింది. కొన ల్యకూ ఇతనికీ పన్ని వేళం ఏమైనా జరిగి వుంటుందా అని శంకించాడు.

“ అన్నట్టు నీలకంఠం! నువ్వీమధ్య రామారావింటికి వెళ్ళుతున్నట్టు కనబడ దేమోయ్ ? మరివ్వాళ భోజనానికన్నా వస్తావా ” అన్నాడు రంగారావు.

నీలకంఠం నేలవంక చూస్తూ చెప్ప లేకుండా వున్నాను” అన్నాడు.

రంగారావు నీలకంఠంబుజం తట్టి “ ఆహ్వానం సరిగ్గా రాలే దనా తటపటాయిస్తున్నావు ? అమ్మవారి కబురందితే గాని వెళ్ళవా యేమిటి ? ” అని బిగ్గరగా నవ్వాడు.

“ అమ్మవారు పిల్చినా—”

“ అమ్మవారిమీద ఏ మంతి శీతకన్ను వేసినట్టున్నావు ? మొన్న మొన్నటిదాకా వారింటికి రోజు కొకసారైనా హాజ రౌతూ వుండేవాడివి, ఇప్పుడు మారి పోవడానికి హేతుభూ తత్వం బైన కారణం బెద్ది ? ” అని పెద్ద పెట్టున నవ్వాడు రంగారావు.

“ మారితేనే గాని నీతివేత్తకా డన్నాడు గిరీశం, అదో ఘట్టంలే. ”

వెంకట్రావుకు కుతూహలం హెచ్చింది. నీలకంఠం మాటల్లో ఏదో మర్మం వున్నట్టు తోచింది. వాళ్ళు ముగ్గురూ స్నేహితులే, కాబట్టి సంగ తేమిటో స్పష్టంగా తెలుసు కుందామని.

"నీలకంఠం! నీకు చెప్పడానికి కభ్యంతరం లేకపోతే మార్పుకు కారణం అడగొచ్చునా నేను?" అన్నాడు.

"అడగొచ్చు గాని చెప్పడానికే నాకు కొంచెం సంశయంగా వుంది."

"అయితే ఆవిడ మంచిది కాదనే అంటావా నువ్వు కూడా?" అని అన్నాడు వెంకట్రావు.

"నీవుకూడా అంటే? ఇదివరకేయెవరన్నాఅన్నారా?"

"మన రంగడే అంటున్నాడులే."

రంగారావు సిగరెట్టు ఒక దమ్ములాగి "నేనల్లా అనలేదు" అన్నాడు.

"అయితే ఏమన్నావేమిటి"

"వెంకట్రావు ఆవిడ మంచిది మంచిది అంటుంటే మా కెవ్వరికి కనబడని మంచి నీ కొక్కడికే యెలా కనపడ్డది" అన్నాను.

"ఏమిటో...గ్రంధం...పేట అంటాడు" అన్నాడు. వెంకట్రావు.

నీలకంఠం కళ్ళు తేలవేస్తూ "నర్సరావు పేట?...నా శృంగభంగానికి కారణం అదే అయింది." అన్నాడు.

వెంకట్రావు మరింత కుతూహలంతో "అయితే కౌసల్య నిజంగా మంచిది కాదా యేమిటి?" అన్నాడు.

నీలకంఠం తల చిటికినవేలితో గోక్కుంటూ "ప్రబంధ స్త్రీ వడుంలా గుంది వ్యవహారం; మంచిదేమో... ... ... కాదేమో!" అన్నాడు.

స్నేహితు లిద్దరూ నవ్వారు. "League of Nationsకి అధ్యక్షుడుగా వుండవలసినమనిషివి నువ్వు ఖచ్చితంగా చప్పన తీర్పు చెప్పడానికి బాగా పనికివస్తావు." అని రంగారావు "నీమార్పుసంగ తేమిటో అఘోరించవోయ్!" అని ఇంకో సిగరెట్టు ముట్టించాడు.

నీలకంఠం సోడా తెప్పించి తాగి మొగంతుడుచుకొని ఒకసారి బిగ్గరగా నవ్వి కథ ప్రారంభించాడు.

"నేను వచ్చి అయిదారు నెల్లయినసంగతి తెలిసిందే. మొదట్లో రామారావును నే నెరగను. ఏదోసందర్భంలో వాళ్ళింటిలో టీపార్టీ జరిగితే నన్నూ పిల్చారు. అప్పుడే ఆయనతో ప్రథమ పరిచయం. ఆయన తెలివి గలవాడే కాని వట్టి పెడకట్టె మనిషి! నాకూ ఆయనకూ అనేక విషయాల్లో వివాదం జరుగుతూ వుండేది. తన కుండేటికి మూడే కాళ్ళు మతం. గ్రహించాక, ఆయన చెప్పిందల్లా సరే నని చప్పన ఒప్పుకుంటూ వుండేవాణ్ణి. ఎంత ప్రయత్నించినా ఆయనమీద నాకిష్టం కలగ లేదు. మనిషి మట్టుకు పూసుకు తిరుగు తాడు."

రంగారావు నవ్వి "ఆయనమీద నీ కిష్టం కలగ లేదేం? పోనీ, నూటికి యాభై మార్కుల్లాగా రెండో సగంమీదైనా యిష్టం కుదిరిందా?" అన్నాడు.

"ఆపవోయ్! నీ వ్యాఖ్యానం." అన్నాడు వెంకట్రావు.

"కంపెన్సేషను క్రింద అర్ధభాగాన్నైనా అంగీకరించావా?" అన్నాడు రంగారావు.

నీలకంఠం నవ్వి "కొంతవరకు నువ్వన్నట్టే అయింది. మొదట ఆవిడమీద నాకేమీ దృష్టిలేదు. ఆడవాళ్ళకేసి చూసినా, ఏదో సమిష్టిమీద స్థూలదృష్టితో చూడడమే కాని సూక్ష్మాభినయనంలోకి దిగలేదు. ఏ మీటింగులో చూసినా కౌసల్యగారు హాజరు. అయితే పాపం మనిషి చాలా నిదానం గానే వుండేది." అన్నాడు.

"అంతనిదానస్తురాలైతే నిన్నెలా ఆకర్షించిందోయ్!" అన్నాడు రంగారావు.

"మరీ నిదానంగావున్నా ఆకర్షణే, గడబిడగావున్నా ఆకర్షణే. ప్రార్థనసమాజంలో ప్రతిఆదివారం సాయంత్రమూ, అంతా తయారయ్యేవాళ్ళం."

"అవును ఆదివారం సాయంత్రమే మీకు దేవుడు కావాలి. వృత్తిప్పుడు బహుశా అక్కర లేదన్నమాట. మాకే దేవుళ్లు గీవుళ్ళు నై. టెన్నిసు, బిల్లియర్డ్సే దేవుళ్ళు." అన్నాడు రంగారావు.

"అంటే తక్కినప్పుడు దేవుడు వద్దని కాదు. వారానికి కానీసమైన మంచిప్రసంగం చేస్తే తప్పేమీ లేదనుకుంటాను. నేనట్టే భక్తులలో వాణ్ణి కాదు గాని, ప్రార్థన సమాజానికి మాత్రం తప్పకుండా వెళ్ళేవాణ్ణి. కౌసల్య వచ్చి మధ్యమధ్య శ్రావ్యకంఠంతో పాటలు పాడుతూ వుండేది. అంతా కళ్లు మూసుకొని ప్రార్థన చేస్తూవుంటే నేను కళ్లుతెరుస్తూ చూస్తూండేవాణ్ణి. కౌసల్య నాకేసి తదేకధ్యానంతో చూస్తూండేది."

"అవును లే. నీకేసి చూడడం అంటే ఏదో శుభ్రమైన విగ్రహాన్ని చూద్దామని అయివుండవచ్చు" అని నవ్వుతూ అన్నాడు రంగారావు.

"ఇలా నాలుగైదుసార్లు జరిగేవరకూ నాకేమీ ఆకర్షణ కలగలేదు. ఆ చక్కని విగ్రహం, ఆ అందమైన చీరా, ఆకళ్ళు, దీపాలకాంతిలో మిరుమిట్లు గొలిపినై. ఆవిడకంటె కూడా భర్తే ఆకర్షణకి కారణమయ్యాడు."

"అదేమిటోయ్, విపరీతం! భర్తని చూస్తే ఇష్టం లేదంటివిగా; ఆకర్షణకి కారణం ఎలా అయ్యాడు? నీ దంతా విరుద్ధంగా వుందే!" అన్నాడు రంగారావు.

"అంటే, అతగాడు నన్ను మహా అసూయతో చూసేవాడు. నీ దెందుకుగా యిలా చూస్తాడని జిజ్ఞాస పుట్టి ఆవిడ మూలానే గదా అనుకున్నాను. ఈ వూహ ఏర్పడి, పురుగు తొలిచినట్లు తొలపడం ప్రారంభించింది నా మనస్సులో."

"అమ్మవారు ఏలినవారి హృదయంలో తిష్టవేసిం దన్నమాట!" అన్నాడు రంగారావు కోరచూపు చూస్తూ, వెంకట్రావును గోకుతూ.

"అతన్ని చెప్పనియ్యవోయ్! అడ్డు రాకు!" అన్నాడు వెంకట్రావు.

"ఓహూ! మహాశయులకు సమాధిభంగం అయినట్టుందే పాపం!" అన్నాడు రంగారావు.

"మనస్సులో పురుగు ప్రవేశించిన దగ్గరనుంచీ నాలో కొంచెం వికారం బయలుదేరింది. దివ్యజ్ఞాన సమాజములో

వెళ్ళినప్పుడుకూడా కౌసల్య నామీదే కటాక్ష వీక్షణం పడేసి వుంచేది. బహిరంగ సభల్లోకూడా ఆ రెండుకళ్ళూ నాముఖం మీదే నిలిపివుంచేది. చూస్తూంటే నాకు చాలా ఆనందమే, గాని ఒక్కొక్కప్పుడు చికాకుగా వుండేది. భర్త అనుమానంతో చూడ్డం, ఇతరులు అప్పుడప్పుడు గమనిస్తూవుండడం, నాకేమో ఉక్కిరి బిక్కిరిగా వుండేది."

"పాపం, మాణగానాం – తేలానాంగా వుందే నీ వ్యవహారం! చాలా అవస్థపడి వుంటావు!" అన్నాడు రంగారావు చిరునవ్వుతో.

"అవునోయ్ చెడ్డఅవస్థ అయిపోయింది! ఏ దేమో ఎరిగిన సన్యాసాలను. మనస్సు బాధిస్తూ వుండేది. చాలా తొక్కిసలాడాను. ఇల్లా మూడునెల్లు గడిచింది. ఇంక అద్దంని చూడటందే వుండలేని స్థితివచ్చింది. మన జీవానికి"

"ఫోటోగ్రాఫు వకటి మెళ్లో కట్టుకో పోయినావా?" అన్నాడు రంగారావు.

"రోజూ ఏదో ఒకవంకమీద వాళ్ళింటికి వెళ్ళేవాడిని. భర్త యింట్లో వున్నా, లేకపోయినా, సమానంగానే ప్రవర్తించేది. ఆ చిరునవ్వు, ఆ ఉత్సాహం, చూస్తూంటే మనకు ఒళ్లు తెలిసేది గాదు! ఆవిడ్ని చూడ్డానికి వీలులేని రోజు ఉపవాసప్రాయమయిపోయ్యేది! ఒకసారి నీతో చెబుదామని కూడా అనుకున్నాను రంగడూ!"

"ఓరి సన్నాసీ! చెప్పావు కాదేమిరా! హామ్మా తుమ్మా తేల్చి పారేసేవాణ్ణి!" అన్నాడు రంగారావు వుద్రేకంతో.

"ఆవిడభావం ఏమిటో బోధపడలేదు. చాలా మథనపడ్డాను. ఈగోలంతా ఎందుకు నాకు, నా ఖర్మాన నేను ఉండిపోతాను. అని మనస్సు రహితము చేసుకుని ఒక ఆదివారం ప్రార్థనసమాజానికి వెళ్ళడం మానేసాను."

"అరేరే! ఎంతపని చేశావు ధర్మమా!" అన్నాడు రంగారావు వికటంగా.

"తరవాత రెండుమూడురోజులకు నేను వాళ్ళింటికి వెళ్ళితే మాటలసందర్భంలో ఆవిడ ఏమండీ మొన్న ఆదివారం నాడు ప్రార్థనకు వచ్చారు కాదేం! మీకోసం చాలా చూశాను, అంది. అనేసరికి నాకు గుండె నోట్లోకి వచ్చేసింది."

"ఆశాశ పెట్టిందోయ్" అన్నాడు రంగారావు.

"నాకు నిజంగానే ఆస పుట్టింది. ఏవో అకబుర్లు ఈ కబుర్లు మాట్లాడి, "నేను వెళుతున్నానండీ. మళ్ళీ వస్తానండీ" అని బయలుదేరాను.

"ఓరి వెర్రినాయనమ్మా!" అని రంగారావు పెద్దపెట్టున నవ్వాడు.

"అవునోయ్! నీ దేం పోయింది, నవ్వుతావు. ఆ స్థితిలో నువ్వెక్కడ వుంటే, అరికాళ్ళల్లో నరాలు లాగేవే."

"బ్రహ్మచారిసన్యాసివి. హామ్మీమ్మా తుమ్మీమ్మా తెల్చుకోకుండా వచ్చావుట్రా" అని నీలకంఠం వీపుమీద తట్టాడు రంగారావు

"ఇంతలోకే ఆవిడ, ఎల్లుండో సారి రండి. మావారు వూళ్ళో కూడా వుండరు. వినుకొండ వెళతారు. ఏకోకులా సాగా కాలక్షేపం చెయ్యవచ్చు, అన్నది. నేను ఏదో స్వర్గం లోకి వెళ్ళానంటే నమ్మవూ!

అల్లా చెప్పు. అనుభవం లేని ఘటంగావే! అప్పుడేం జేశావు?" అన్నాడు రంగారావు.

"ఆవిడన్న మాటలేనా యివి? లేకపోతే ఏమన్నా భావకవిత్వం చెపుతున్నావా?" అన్నాడు వెంకట్రావు. హేళనగా.

"మక్కికి మక్కీ ఆవిడమాటలే. మళ్ళీ యెప్పుడు వస్తాడు ఆయన? అన్నాను. మూడు రోజులదాకా రారు అన్నది. సంతోషంచేత కెవ్వున కేకేసివుందును. ఎలాగో అణుచుకుని, అచ్ఛా అనుకొని యింటికి వెళ్ళి పోయానూ. మూడోనాడు మధ్యాన్నంవరకు యమ యాతనై పోయిందనుకో. యెప్పుడు రోజుగడుస్తుందా! అని నిమిషాలు లెక్కబెట్టేవాడిని. దాని మొహం యీడవ! నిమిషం రెండు నిమిషాలకి గాని గడిచేదికాదు. సరే, యెలానైతేనేం, మొత్తం మీద మూడోనాడు మధ్యాహ్నం మూడుగంటలకి కౌసల్య గారింటికి వెళ్ళాను,

"మూడు గంటలదాకా యేం అఘోరించావు ? అవున్లే. పగలు రాత్రి అనే భేదం పెట్టుకో వద్దని పార దారికాధికరణంలో వాత్స్యాయను డన్నాడులే" అని రంగారావు ఈల వేశాడు.

రామారావుగారు రెండుగంటల కోయ్ అసలు ఊరు బయలు దేరింది. అందుకోసం మూడుగంటలకి వెళ్ళాను. నేను వెళ్ళేసరికి ఆవిడ యెదురుగా వచ్చి నన్ను లోపలికి పిలుస్తుం దనుకున్నాను. రాలేదు. కొంచెం ఉత్సాహభంగం అయింది. అసలు నాకోసం కని పెట్టుకునే వుంటుం దనుకున్నాను. సరే, తలుపు వేసి వుంటే తట్టి, కౌసల్యాదేవిగారూ అన్నాను. ఆవిడ వచ్చి తలుపు తీసి "రండి" అని చిరునవ్వుతో ఆహ్వానించింది. మళ్ళీ మనస్సులో కొంచెం చంద్రోదయం అయింది. ఆవిడ లోపలిగదిలోకి గాని, అధమ పక్షం హాలులోకి గాని, తీసు కెళ్ళి కూర్చోబెడుతుందను కున్నాను, వరండాలో కుర్చీలో కూర్చోమంది."

"ఆవి డెక్కడ కూర్చుంది ?" అని వెంకట్రావు ఆదుర్దాగా అడిగాడు.

నా కెదురుగా కొంచెందూరంలో కుర్చీలో కూర్చుంది. రామారావు ఎప్పుడు వెళ్ళారు ఊరికి ? అన్నాను. ఓ గంట అవుతుంది, అంది. మళ్ళీ యెప్పుడు వస్తారు ? అన్నాను. మూడురోజులు దాకా రారు, అంది. అలాగా ? లోపల ఎవరున్నారు ? అన్నాను. మా తమ్ముడున్నాడు అంది. ఓహూ !

అదా కారణం? అంచేత లోపలికి పిలవకుండా ఇక్కడే కూర్చోబెట్టింది అని మనస్సులో అనుకున్నాను. అయితే, మీ తమ్ముణ్ణి కాస్త పిలవండి. కాఫీ తెస్తాడేమో? అన్నాను. కాఫీ యెందుకు లెద్దురూ! అంది. కాదు, కాఫీ పడితేగాని కులాసాగా వుండదు, పిలవండి, అని కొంచెం బలవంతం చేశాను. విధిలేక పిలిచినట్టు తమ్ముణ్ణి పిలిచింది. ఎందుకీ గొడవ? పోనీ మానేద్దామా; అనిపించింది నాకు. నా వుద్దేశ్యం, ఆ కుర్రాణ్ణి పంపించి అసలు సంగతి తేలుద్దా మని. వాడు నన్ను చూసి వుషారుగా ఓ నిమిషంలో తెస్తానంటూ గ్లాసుక్కూ వుచ్చుకున్నాడు. మూడు కప్పులు పట్రా అన్నాను.

"భలేయెత్తు యెత్తావే, చాణక్యుడంత మనిషివి!" అని రంగారావు నీలకంఠం బుజం తట్టాడు.

నీలకంఠం దస్తీ పెట్టి మళ్ళీ ముఖం తుడుచుకుంటూ, "ఇంకో సోడా పట్రారా అబ్బీ!" అని కుర్రాడిని కేకేశాడు.

"నీళ్ళు తాగిస్తోంది నీ చేత వ్యవహారం!" అని రంగారావు ఇంకో సిగరెట్టు ముట్టించినాడు. నీలకంఠం సోడా తాగి నాలికతో పెదిమలు తుడుచుకుని అవునోయ్ నీళ్ళు తాగించింది వ్యవహారం! మనకు శృంగభంగం అయిం దక్కడే. కాస్త మెద డుపయోగించినట్టయితే దూడ వేసేవాణ్ణి గాను. మనకు వాటర్లూ యుద్ధమంత దెబ్బ తగిలింది!" అని పెదిమి విరిచినాడు.

"ఏం జరిగిందేం?" అన్నాడు వెంకట్రావు.

"ఆవిడ ఏదో ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెబుతూనే వుంది. కాని కంఠస్వర మేమో మారిపోయింది. మాటి మాటికీ వీధివాకిలి కేసి చూడ్డం మొదలెట్టింది. తమ్ముడు త్వరగా వస్తాడేమో అని ఆదుర్దాగా చూస్తోందేమో అను కున్నాను. కంఠస్వరం మారడం లోపల కోరికవల్ల నేమో అనుకున్నాను. మధ్య మధ్య ఆవిడ ధోరణి చూస్తే, అసలు సంగతిమీద అభిలాష లేదేమో అని పించింది నాకు."

"ఇంత గ్రంధం జరిగినాక కూడా అభిలాష లేదంటా వేమోయ్! ఆవిడకి? అన్నాడు రంగారావు వికటంగా.

నాకు కళ్ళు బహుశా యెర్రబడి వుంటయి. నా కంఠ స్వరం గూడా మారిపోయి వుంటుంది. నేను గూడా గుమ్మం కేసి చూడడం మొదలెట్టాను. మేమిద్దరమూ బహుశా నాలుగు నిముషాలసేపు ఏమీ మాటలాడ లేదనుకుంటాను. పోనీ వూరుకుందామా అనిపించింది. వెంటనే, మునిన్నెలల నుంచీ పడుతున్న యమయాతన జ్ఞాపకం వొచ్చింది. ఇహ ఈ బాధపడ్డం? యెందుకు ఏదో తేల్చేసుకుందా మనిపించింది. ధైర్యంచేసి గొంతు సవరించుకుని, అటు ఇటు చూసి మీతో వో సంగతి చెప్పా లనుకుంటున్నానండి చాలా రోజుల నుంచి, అని ఆవిడ మొహంకేసి చూశాను.

"రైటో! షాబాష్! అని" అరిచాడు రంగారావు నీలకంఠంతొడమీద చరుస్తూ.

"నీ కేమోయ్! అల్లాగే వుంటుంది. అప్పటి నా స్థితి అవస్థ భగవంతుడికే తెలియాలి. ఆవిడ తెల్లపోయి తమ్ముడూ అని కేక వేసింది. నాకు కాళ్లూ చేతులూ చల్లబడ్డయి. ఎలాగో మళ్ళీ ధైర్యం తెచ్చుకుని ఏమ్బే మరేం కాదండీ! అంత చెప్పు దగ్గ దేం కాదు, అన్నాను. కుర్చీలో నుంచి లేవ బోతున్న ఆవిడ మళ్ళీ కూర్చున్నది.

"అరేరే!...!" అన్నాడు రంగారావు.

"చూశావా, ఆవిడ యెంత మంచిమనిషో?" మొదటి నుంచీ నేను చెబుతూనే వుంటిసిగా" అన్నాడు సగర్వంగా వెంకట్రావు.

"తర్వాత నేను ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చుని, కుర్రాడు కాఫీ తెచ్చినాక ఎలాగో తాగ అయ్యా! మళ్ళీ సారి వస్తాం, సెలవు తీసుకుంటాను, అని చల్లగా తోక ముడిచాను."

"మంచిపని చేశావ్!" అన్నాడు వెంకట్రావు.

"ఏడిసినట్టే వుంది." అని పెదవి విరచినాడు రంగారావు.

"నేను ఇంత బుద్ధిహీనుడ్నై పోయానే అని చాలా విచారం కలిగింది. అంతటితో వాళ్ళింటికి వెళ్ళడం మానేశాను. ఆ వీధికి వెళ్ళడమే మానుకున్నాను." అన్నాడు నీలకంఠం.

"వీధి మన్నా కూడా అయింది. అయితే, ఈ మధ్య మళ్ళీ ఆ వీధినే వస్తున్నావే?" అని ప్రశ్నార్థకంగా మొహాం పెట్టాడు రంగారావు.

“ఎన్నాళ్ళని మానగలం మరి? రెండువారాలు పూర్తి కుని, మళ్ళీ యేదో పనివస్తే ఆదారినే వెళ్ళక తప్పిందికాదు.’

“మంచి దోవకి వచ్చావన్న మాట. అలా రా!’ అని రంగారావు సకిలించాడు.

“ఆదోవన వెళ్ళడమే మానేసినట్టయితే ఉపయుక్త లేకుండా పోయె. ఇప్పుడు మళ్ళీ వక చిక్కులో పడ్డాను. నే నా దారినే పోతున్నప్పుడల్లా ఆవిడ తలుపు గట్టిగా వెయ్యడం చప్పుడయ్యేలాగా తియ్యడం, కిటికీదగ్గిర నుంచుని తొం పొడుగూన చూడడం, మధ్య మధ్య చిరునవ్వు విసరడం చేస్తున్నది.”

“అలాగా క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్ అన్న మహాకవి వెర్రివుల్లాయిటోయ్! మొదట నువ్వు తొం దరపడే సరికి ఆవిడ బే అంది. తరవాత కాస్త ఆలోచించ కున్న తరవాత నీ మీద ఉన్ముఖంగా వుంటోంది. అంతే ఏ మనుకున్నావు? బ్రహ్మచారి కట్టెవు నీ కేం తెలుస్తుంది.’ అని రంగారావు నీలకంఠం బుగ్గమీద చిన్నచిటిక వేశాడు.

“ఆ! మీ పిచ్చిమాటల కేం లెస్తురూ? ఆవిడ చాల మంచి మనిషి. మీరు ఉత్త వెర్రి పీనుగులు!” అన్నాడ వెంకట్రావు.

“ఏదీ ఇదమిత్థ మని తేల్చడం మనతరం కాదు. మనిషి కొక అభిప్రాయం. సరే; ఇవ్వాళరాత్రికి అందరం భోజనాని

వెళదాము. నువ్వూ రాక తప్పదోయ్! కొంచెం భావ పరీక్ష చేస్తాను ” అన్నాడు రంగారావు.

“ నా కాహ్వానం వచ్చిందా ? ”

“ ఇందాక కాగితంలో నీ పేరుకూడా చూశాను. నీ దస్కతునుట్టుకు లేదు ! ” అన్నాడు రంగారావు.

“ సరే, వస్తాను. ఏ మవుతుందో చూస్తాను. ” అన్నాడు వెంకట్రావు.

“ ఏమయ్యే దేమిటి? ఈ దెబ్బతో పడ్డదన్న మాట. అన్నాడు రంగారావు.

“ ఏమిటి పడేది నీ మొహం ! పాపం ! ఆవిడ చాలా మంచి మనిషి ! ” అన్నాడు వెంకట్రావు.

“ సబర్ కరో ” అన్నాడు నీలకంఠం.

# రిపోర్టు

౧

రంగారావు ప్రతిరోజూ తెల్లవారుజామున షికారు వెళ్లుదా మనుకొన్నాడు. తోడు లేకుండా షికారు వెళ్ళడం అంటే చిరాకు. అందుకని నీలకంఠాన్ని వెంట రమ్మని పిలిచాను.

"అబ్బ, నువ్వొచ్చి నన్ను లేవకొట్టాలిసిందే కాని, స్వరాజ్యం వస్తుందన్నా తెల్లవారుఝామున లేచే ఘటం కాదిది. నీకు తెలిసిందే కదా" అన్నాడు నీలకంఠం.

ఇలా కొద్దిరోజులు శీతాకాలంలో మిత్రులు ఇద్దరూ షికారు వెళ్ళేవాళ్ళు. ఆ వేళ రంగారావు వచ్చి, "నీలకంఠం" అని కేక వేశాడు. అతను పలుకలేదు. తలుపు దబదబా కొట్టాడు. అప్పటికీ సమాధానం రాలేదు. ఒక వేళ వీడు వొంటరిగా లేడేమో అని సంశయించి రంగారావు వెనక్కి తిరిగి పోదా మనుకుంటూ కిటికీ దగ్గరకు వెళ్ళి రెక్క నెట్టాడు.

గడియ సరిగా లేకపోవడంచేత తలుపు తెరచుకుంది. అందులోనుంచి చూస్తే నీలకంఠం నిద్రలో వున్నాడు. రంగారావు కొంచెం గొంతెత్తి "నీలకంఠం! నీలకంఠం!" అని

కేక లెట్టాడు. నీలకంఠం కళ్లు నలుపుకుంటూ లేచి "ఏమి టోయి! పడిపోయినట్టు తెల్లవారుఝామునే వచ్చి అరుస్తున్నావు! ఇవాళ రాలేనురా అబ్బీ! నువ్వుకూడా మానెయ్యి" అన్నాడు.

"ఒరే! పట్టుమని పదిరోజులన్నా రాలేవు. ఈమధ్య నేను ఊళ్ళో లేకపోతిని. ఇవ్వాళే మొండికేస్తున్నావేమిరా?" అన్నాడు.

నీలకంఠం కిటికీదగ్గిరకు వచ్చి "రంగడూ! తెల్లవారుఝామునే రోజూ యెలా లేస్తావురా? వెచ్చగా ఇంట్లో పడుకోక! ఆరోగ్యం, ఆరోగ్యం అని అఘోరిస్తావు. సాయంత్రం షికారు చాలదా? అయినా, యివ్వాళ నీవెంట రావడానికి వొంట్లో బద్ధకంగా వున్నది. కావలిస్తే నువ్వేపో, అంత అభ్యాసం చెడిపోతుందనేటట్టయితే" అనేశాడు.

వెడదామా అనుకున్నాడు రంగారావు. మిత్రుణ్ణివదిలిపెట్టి ఒంటరిగా వెళ్లడానికి అతనికి బద్ధకం వేసింది. చివరి ప్రయత్నం చేసి చూద్దామని "రావోయి! ఏం అంత బడలిక నీకు? అమ్మవారు ఎవరన్నా ఉందా ఏమిటి?" అని నవ్వుతూ అన్నాడు.

"కాస్త తెల్లవారఝామున కునుకు పడితే నువ్వొచ్చి చెడగొట్టావు! ఇవ్వాళకి మానేసి లోపలికిరా, తలుపుతీస్తాను." అన్నాడు నీలకంఠం.

రంగారావు లోపలికి వచ్చాక, నీలకంఠం అతన్ని పడక కుర్చీలో పడుకోమని "నేను మళ్ళీ కాస్త కునుకు తీస్తానురా అబ్బీ!" అని మంచంమీద వెన్ను వాల్చాడు.

"ఏమిట్రా! ఆరుగంటలు కావచ్చినాకూడా మళ్ళీ పడక వేస్తానంటావు? అప్పుడే జనంఅంతా లేచి తిరుగుతున్నారు చూడు. లేచి పండ్లుతోముకో, కాఫీ అన్నా వేగిరం తాగేద్దాం."

బలవంతాన నీలకంఠం లేచాడు. మిత్రులిద్దరూ దంత ధావనం చేసి, కాఫీ తెప్పించి తాగుతున్నారు. రంగారావు స్నేహితుడికేసి తేరిపార చూసి "ఎవరురా అమ్మవారు?" అన్నాడు నవ్వుతూ. "తరువాత చెప్తాలే," అన్నాడు నీలకంఠం. "నీకేం అడ్డు తగిలేవాణ్ణి కాదాయెను. కాస్త చెప్పవోయి! నీకు గుడ్ కాండక్టుసర్టిఫికెట్లు పారేస్తానే వున్నాను రోజూనూ. కంచుకోటలాంటి మనిషిని" అన్నాడు రంగారావు మందహాసంతో.

"నువ్వు అడుగక పోయినా ఎల్లాగూ చెప్పేసేవాడినే ఇటువంటి విషయాల్లో మన నోట్లో నువ్వుగింజ నానదు" అని సిగరెట్టు ముట్టించాడు.

"ఈ మధ్య మానేసి మళ్లీ యెప్పుడు మొదలు పెట్టావురా?"

"నువ్వు వూరికెళ్ళాక చిన్నక్షోభ జరిగింది. మరిచిపోవడానికీ, కాస్త మజా వుడాయించడానికి మళ్ళీ శ్వేతసమిధలు హోమం చేస్తున్నాను."

"మళ్ళీ క్షోభా? ఔను! నీమీద రిపోర్టుకూడా వచ్చిందోయి."

"మనమీద రిపోర్టు చేసేవాళ్ళుకూడానా! ఆ మహాశయుడు పుట్టాడా? పుడతాడా?"

"మహాశయు అనుకో."

"ఎవరోయి! ఈ మహాశయీ?

"నా భార్య."

"చచ్చితివిరా గిరిజారమణా! కొంప మునిగింది! మన కీర్తి నీభార్యాదాకా వెళ్ళిందా?" అని ఆదుర్దాగా రంగారావు ముఖంకేసిచూసి, పక్కదమ్ములో సిగరెట్టు లాగేశాడు నీలకంఠం.

రంగారావు నవ్వుతూ "ఆవిడే స్వయంగా చెప్పిందోయ్. రాత్రి. నువ్వు బొత్తిగా బేఫర్వామనిషి వైపోతున్నావే" అని రంగారావుకూడా సిగరెట్టు వెలిగించాడు.

"అబ్బ! ఇన్నాళ్ళదాకా నేను మంచివాణ్ణి అనే నీభార్యకు సదభిప్రాయం వున్నట్టు కనబడేది. ఇప్పుడు కాస్తా మన నిజస్వరూపం బయట పడేసరికి, ఆవిడ నన్నుగురించి ఏమనుకుంటుందో? ఇహ మీ యింటికి వచ్చి మీఆవిడ ముఖం చూడ్డం కష్టమేరా అబ్బ!" అని దిగులుతో అన్నాడు నీలకంఠం.

"ఏడిశావులే! ఈ మాత్రానికేనా మా యింటికి రావడం మానేసేది? నీమీద ఆవిడకి మొదటినుంచీ సదభిప్రాయం వున్నట్టూ, ఇవ్వాళ పోయినట్టూ! మరేం. పరవా

లేదు. మా యింటికి భోజనానికి ఆఘోరించవోయి! యివ్వాళ."

"**No, Thanks.** ప్రస్తుతం మనం కొన్నాళ్ళు అజ్ఞాతవాసంలో వుండాలి. అయితే, అసలు రిపోర్టు సంగతేమిటో సెలవియ్యి!"—రంగారావు సిగరెట్టుముక్కను **Ash-tray** లో పడేసి రెండు చేతులవేళ్లూ కలిపి చిరునవ్వునవ్వి,—"నీవు మాపక్కభాగంలో వున్నఆయన అన్నకూతురు జానకిని ... ... నిజం అంటావా, బొత్తిగా ఏమీ ఎరగనంటావా?" అన్నాడు రంగారావు.

"మనది శుక్రాచార్యులవారి మతం కాదోయి. వారి జాష్టులందు వైవాహికములందు ... ... ... అందులో నీదగ్గరనా! అయితే నీభార్యకెలా తెలిసింది?" అన్నాడు నీలకంఠం.

"జానకే చెప్పిందట!"

"దీన్ని తగలెయ్య. ఇదే చెప్పిందా? ఏమిటి చెప్పింది?"

"తెల్లవారుఝామున నీవు సందులోనికి వెళ్ళి తలుపు తట్టావుట; తాను తలుపుతీసుకువచ్చి, "ఏమండీ! మీరు పెద్దమనుష్యులనుకున్నాం. ఉండండి, మాకక్కయ్యతో చెప్తాను. ఆయన పూరినుంచి రానియ్యండి!" అని బెదరిస్తే నువ్వేమో గాభరాపడి దణ్ణం పెట్టి, "చెప్పవద్దు" అని బతిమాలుకున్నావుట. అని యింకేమేమో చెప్పింది"

"ఏడిసింది! అయితే, నీభార్య నమ్మిందా ?"

"ఆవిడ, యీ కథంతా విని, అతను నీకు నిజంగా దణ్ణం పెట్టాడా అని అడిగిందట. వూరికే దణ్ణం పెట్టడమే కాదు, కాళ్ళకు కూడా దణ్ణం పెట్టబోయినాడు.

"ఝూటాఖోర్! జరిగింది ఒకటి, రిపోర్టు అయింది యింకొకటి. తరవాత ?"

"నాభార్యా చిరునవ్వు నవ్వి, నీలకంఠం చాలా మంచి వాడే. ఇటువంటి వ్యవహారాల్లోకి ఎప్పుడూ వెళ్ళేవాడు కాదు. అతని పనేమో కాని, అయినా, నీకు నిజంగా దణ్ణం పెట్టాడా? చస్తే దణ్ణం పెట్టాడా—"

నీలకంఠం ఆతురతతో రంగారావు మాటకి అడ్డుపోయి "ఒరే! అబ్బీ! నీభార్యకు సాష్టాంగ దండప్రణామములు నా భాగ్యురాలంటే ఆవిడే! నిజం యెలా కనిపెట్టేసిందిరా అబ్బీ!" అని ముఖం పైకెత్తి అడిగాడు.

"ఆడాళ్ళు ఆమాత్రం కనిపెట్టలేరూటా? అయితే ఒకటి మట్టుకంది నాభార్య; నువ్వు నాస్నేహితుడివి కాబట్టి మంచి వాడివని అన్నిణ్ణి దబాయించింది. కాని నువ్వు ఏదో చేశావని మట్టుకు నమ్మకం. కొంచెం జాగ్రత్తగా కూడా వుండమని చెప్పమన్నది."

"బుద్ధి! బుద్ధి! ఇంతమట్టుకు జరిగిన దానికి కృతజ్ఞుణ్ణి."

"అయితే జానకి, మర్నాడు అన్నం మానేసి, ఏడ్చి మొత్తుకోవడంచేత, నువ్వు ఏదో చెడ్డపని చేశావనుకుంటున్నది నాభార్య"

"ఒరే! ఎంత అన్యాయం! నిజం చెపితే ఆశ్చర్య పడతావు. అన్నం మానేసిన జానకిని సైబీరియాలో పడేసి మంచు గడ్డ తినిపించాలిరా! దీన్నితగలెయ్య, ఇరవైయేళ్ళున్న ఆ ల్యాశేవో యీవిడ ఎన్నిమాయలు నేర్చిందోయి! మొగుడి మొఖాన మొద్దులు పెట్టేటట్టుంది. పతివ్రత Pose బాగా వేసింది.... ... ...

ఇటువంటివాళ్ళని చూస్తే అసహ్యం వేస్తుంది. పైగా అన్నంకూడా మానేసిందేం ?" రిపోర్టు చేస్తుందేం?

"అసలు జరిగిందేమిటో చెప్పు సక్రమంగా."

౨

"రంగడూ! మొదట జానకిని నేను గమనించనే లేదురా. మీ యింటికి వస్తూపోతూ వుండేవాడినా? ఒకనాడు మనం యిద్దరం కూర్చుని మాట్లాడుతూనేవున్నాం, నాముఖం వాళ్ళ కిటికీవైపు వున్నది. నువ్వు తూర్పుపక్కకు ముఖం పెట్టుకు కూర్చున్నావు. నే నెందుకో వూరికే వాళ్ళకిటికీ కేసి చూసే సరికి ఆ పిల్ల నా కేసి చూస్తూఉంది."

రంగారావు "నవ్వి ఇంకా ఇరవైయేళ్ళదాకా ఆడాళ్ళు నీ కేసి చూస్తూనే వుంటారులే. మరేం దిగులు పడకు. తరవాత ?" అన్నాడు.

"తరవాత మళ్ళీ మాటలమధ్యన రెండుమూడు సార్లు కిటికీ కేసి చూస్తే జానకి నావైపే చూస్తూఉన్నది. మన వింత వేషం పరిశీలిస్తున్న దేమో అనుకున్నాను."

"నిన్ను కొత్తగా పరిశీలించట మేమిటోయి! అదివర కన్నిమార్లు వచ్చేవాడివి కాదు! అదే ప్రథమ దర్శనం అంటావా?"

"కాదు. అప్పు డప్పుడు చూస్తూ వుండేది. మరి కిటికీ దగ్గర వున్నప్పుడు మన్మథు డేమైనా నారి సారించాడేమో చెప్పలేను. అప్పటికీ విడిగా వున్న మనిషి కాదు. మీ పక్క భాగంలో మనిషాయెను. మన కెందుకీ గోల. కాస్త కొండ పెంచితే నువ్వేమన్నా చివాట్లేస్తావేమో నని భయంకూడా నాయె. అందుకని నేను ఆ ఉద్యమం పెట్టుకోలేను."

రంగారావు బిగ్గరగా నవ్వి. "ఏమాత్రం. సాదున్నా జారబడే ఘటానివి! బెజవాడ రెండుకొండలమధ్యా కృష్ణ వేణమ్మవలె నీవ్యవహారం. ఆక్షణంలో నీ ఉద్యమం విరమించావంటే, తాత్కాలిక వైరాగ్య మన్నా కావాలి, ఇంకా వ్యవహారం ముదరనిద్దామని అన్నా అనుకొనివుండాలి" అన్నాడు.

"ఠీక్. మర్నాడు, మీ యింటికి వచ్చినప్పుడు అప్రయత్నంగా మనకళ్ళు కిటికీ మీదికే వెళ్ళినవి. జానకీదేవి ప్రత్యక్షం. మనమీద ఒక మందహాసం పారవేసింది. నేను కూడా—"

"రైటో! నాలుగుకళ్ళూ కలవడమే కాకుండా మంద హాసాలుకూడా వడ్డవంటే మన్మథుడు బావుటా యెత్తాడన్న మాటే! ఔనులే. కుఱ్ఱది వచ్చి రెండు నెలలు కావస్తూంది. మొగుడు సన్యాసి అదేదో వూళ్ళో వున్నాడట. అందుచేత మనసు తిరిగి వుంటుంది."

"సరే! మళ్ళీ సాయంత్రం మీ యింటికి వచ్చినప్పుడు ఆవిడ వయ్యారంగా కిటికీదగ్గర నిలుచుని కటాక్షవీక్షణాలు పారేసింది మనమీద. అటూ యిటూ చూసి నేను చెయ్యి విసిరాను."

"బహుత్ అచ్ఛా. నీదంతా అష్టావధాన వ్యవహారం. కన్ను కదిలేసరికి కరంకూడా కదిలించన్నమాటే!"

"చెయ్యి విసిరి మళ్ళీ అటూ యిటూ చూశాను. ఆవిడ నవ్వి తలకాయ వంచుకుంది, ఇంతట్లోకే నువ్వు వచ్చావు. ఆవిడ అంతర్ధానమైంది. తర్వాత మనం చదరంగం ఆటకు కూర్చున్నాము."

"ఔరా! పిడుగా! దొంగకు తెలియకుండా దొంగతనం చేశావే. నాకు చెప్పావు కాదేం?"

"అబ్బే, ఏదైనా పరిపాకానికి రావాలి. దిలీపమహారాజుసంగతి చూడు. ఫలానుమేయాః ప్రారంభాః అన్నాడు కవి. వ్యవహారం జరిగాక, ఓ హూ యిలాగా అని వూహించాలి గాని ముందే బుడబుడా చెప్పేస్తామా?"

"ఔనులే! నీ కాముకకళలలో రాజనీతికూడా అహో రించింది లే" అని రంగారావు చిరునవ్వుతో తనమీసం దువ్వుకున్నాడు.

"ఏం వుంటే ఏమోయి. మన రాజతంత్రం బాగా సాగలేదు. మిత్రు డనుకున్నవాడు ఉదాసీనుడో, శత్రువో అయిపోతున్నాడు. సరి, మనం చదరంగం ఆటలో కూర్చుని పొద్దు పోవడం, నాన్న నన్ను భోజనానికి వుండ మనడం సంభవించింది. ఇంతలోకే వాళ్ళ కక్కయ్య వూరికి బయలు దేరిపోవడం మన కందరికీ తెలిసిందే. అప్పుడు నాకు హుషారు పుట్టింది."

"ఔనులే. మంచి అవకాశం కనిపెట్టావు. ఇంట్లో ఆయన లేకపోవడం, ఆయన కొడుకు పదేళ్ళకుర్రాడే వుండడం మంచి అవకాశం. అందుకనే కాబోలు భోజన మైనాక యింటి కెళతావురా అబ్బ అంటే, ఏమిటోరా బద్ధకం వేస్తోంది అని మొరాయించి మావరండాలో పడుకున్నావు వూరుచివర కొంపామొను నీది. పైగా చీకటిగా వుంది. నిజంగా బద్ధకించావు కాబో లనుకున్నాను."

"ఔనోయి, ఒక Pose వేశామంటే అది సహజంగా కనపడాలి గాని ఎరువు తెచ్చిపెట్టుకున్నట్టా? తర్వాత అక్కడే పడుకున్నాను. ఎంత సేపటికీ నిద్రపట్టలేదు. ఆవిడ కిటికీ తెరచి సంజ్ఞ చేస్తుం దనుకున్నాను. ఎంతసేపు చూసినా ఆ జాడా ఏమీ లేదు. ఏకో కాస్త చప్పుడైతే తలుపు తీసుకొని వస్తు

న్నది కాబోలు అని ఆశతో చూస్తే అదీ వట్టిదే అయింది. తరవాత విసుగు పుట్టి నిద్ర పట్టి వుంటుంది."

రంగారావు కోరచూపు చూసి, "నీవు కామయ్య మొగుడివను. రాలేదు. కాబట్టి విశ్రమించి వూరుకొని ఉంటావు" అన్నాడు.

"ఛీ. తెల్లవారుఝామున మళ్ళీ మెలుకువ వచ్చింది మనం చలిలో లేకఘటం కాకపోయినా యీ సంగ తేమిటో తేల్చుకుందామనే అదుర్దావల్లా, వాళ్ళభాగంలో ఏదో చప్పుడు కావడం వల్లా నాకు మెలుకువ వచ్చింది. లేచి శాలువా మంచం మీదనే పడేసి, నెమ్మదిగా వాళ్ళ పడమటిగోడసందు లోకి వెళ్ళాను. తలుపు వూరికే గొళ్ళెం పెట్టేవున్నది. గొళ్ళెం చల్లగా తీసి, పెద్దకిటికీ దగ్గరికి వెళ్ళాను. ఒక నిమిషం ఆగి నెమ్మదిగా మూడుసార్లు కిటికీ రెక్క మీద చిటికవేశాను. అప్పటికి చంద్రోదయం అయింది. దానిమ్మచెట్టునీడ కొద్దిగా నా మీద పడుతూఉంది. ముఖం కొంచెం నీడలోకి తిప్పి నిల్చున్నాను. ఇంతలోకే కిటికీతలుపులు నెమ్మదిగా తెరచు కున్నవి. జానకి మెల్లిగా "ఎవరు వారు" అన్నది. నేను ముఖం కనబరిచాను. ఆవిడ ఒకమాటు కిటికీదగ్గరనుంచి లోపలికి వెళ్ళి దీపం పెద్దది చేసి అటూ యిటూచూసి కిటికీదగ్గిర కొచ్చింది. నేను చెయ్యి వూచలసందులోంచి లోపలికి పెట్టి, ఆవిడ చెయ్యి పట్టుకోబోయినాను. ఆవిడ వెనక్కు చూసి నెమ్మదిగా ముందుకు వంగి, మీరు వెళ్ళండి అని బతిమాలు కున్నట్టుగా చెప్పింది."

"అంతదూరం వచ్చి వెళ్ళిపొమ్మంటుం దేమిటోయి! ఇదే ఆడాళ్ళ దగ్గరున్న వింత!" అన్నాడు రంగారావు వికటంగా నవ్వుతూ.

"కాదు అటువచ్చి తలుపుతియ్యి. లోపలికి వస్తాను అన్నాను. ఆవిడ లోపలికి రెండడుగులు వేసి నాలుగువైపులా చూసి పొండి, అబ్బ, పొండి, అని చాలా దీనంగా అన్నది. నాకు వెళ్ళిపోదామని బుద్ధి పుట్టింది. కాని, అందాకా వచ్చి అమ్మో తుమ్మో తేలకుండా వెళ్ళట మేమిటి అని, నేను బతిమాలుకుంటూ, నన్ను చంపక ఆ తలుపు తీస్తూ! మళ్ళీ యింకాస్సేపైతే తెల్లవారుతుంది అన్నాను. జానకి కొంచెం తటపటాయించింది. ఇంతలో వరండాలో ఏదో చప్పుడైనట్టు వినపడింది. నేను నెమ్మదిగా వెళ్ళి ఏమిటో అని చూశాను. పిల్లి మేజామీదికి దూకి ముకాం వేసింది. దీని ముఖం యీడవ! అని తిట్టుకుని మళ్ళీ దానిమ్మచెట్టుదగ్గిరికి వెళ్ళి చూసేసరికి కిటికీ వేసి ఉన్నది. ఇదేం వికారం అనుకుని వెనక్కు తిరిగాను."

"ఓరి నాయనమ్మో! నేనైతే చస్తే వెనక్కి వెడతానురా! తీరా మొగ్గవలసి వచ్చేసరికి అజ్ఞానుకిలా అయిపోతావు" అని రంగారావు నీలకంఠం కాలిమీద తట్టాడు.

"నీ కేమోయి, అల్లాగే సెలవిస్తావు. రంగంలో వుంటే గాని తెలియదు. అప్పుడేం తోచింది కాదు నాకు. సరే కాదుకులే మర్నాడు అని వెళ్ళి పడుకున్నాను. పడుకున్నానే

కాని నిద్రకూ మనకూ ఏమీ సంబంధం లేక పోయింది. దీనిసంగతి ఏమిటా అనీ, స్వాధీనం చేసుకునే మార్గం ఏమిటా అనీ యోచించాను."

"వనిత తనంత తా వలచి రావాలి గాని నువ్వు స్వాధీనం చేసుకునే దేమిటోయి! నీ అందచందాలమీద ఆధార పడ్డావు. స్త్రీ ఆందోళనలో వున్నప్పుడు పుట్టుక నీ హుషారీ వల్ల పడిపోతుందేమో కాని" అన్నాడు రంగారావు

"నీ కామకేళి ఎవడికి కావాలి, కార్యశూరత్వం కాని సరే, అప్పటి కేం లాభం లేదనుకొని వూరుకున్నాను అంత టితో వూరుకుంటే బాగుండేది. అహం పొడుచు కొచ్చింది. ఒక అరగంటసేపు ఆగి వుంటాను. మళ్ళీ లేచాను."

"ఔరా, పిడుగా, రాబర్టు బ్రూసు రకంగా వున్నావే. దీనికే నిన్ను చూసి నేను గర్వపడేది!"

"మళ్ళీ వెళ్ళానోయి. వెళ్ళి కిటికీ తలుపు కొట్టాను. కొట్టి, ముఖం కనరపడకుండా పక్కకు నిలుచున్నాను. జానకి కిటికీతలుపు కొద్దిగా తెరిచి చూసింది. నిజంగా ఎంత బాగుం దనుకున్నావు ఆమెముఖం! చెవులకమ్మలు ధగధగలాడుతూ ఉన్నవి. రవ్వ పొదిగిన ముక్కుపుడక మెరిసిపోతూ వున్నది. ముఖాన బొట్టు కొంచెం చెరిగి అదో అందంగా వున్నది. కిటికిచువ్వలు అడ్డం వుండిపోయినవి గాని —"

"నీ మొఖం! చువ్వలడ్డం వుంటే సందు లేమైన నోయ్?"

“కొంచెం తమాయించు. నువ్వు ఒకడివే మగాడివి కావులే. నేను నెమ్మదిగా చువ్వలసందులోనుంచి చెయ్యి పోనిచ్చి ఆవిడ చెయ్యి పట్టుకో బోయినాను. జానకి చప్పున రెక్కలు ముయ్యబోయింది. అయ్యో చెయ్యి నలిగిపోతూంది అని బాధ నటించాను. ఆవిడ రెక్కలు కొద్దిగా తెరిచింది. “అబ్బ, మీరు వెళ్ళుదురూ!” అన్నది. వెళ్ళడానికి వీలు లేదు; చంపక, ఆ ఉత్తరవువైపు తలుపుతియ్యి. ఐదు కూడా అయింది. అని గోల పెట్టాను.”

“చెయ్యి పట్టుకునిట్రా గోలపెట్టేవి? ఇదేం షేక్ హాండ్ వ్యవహారమా?”

“అంత తొందరేమిరా అబ్బి నీకు! కాస్త వోపిక పట్టలేవు! జానకి వెనక్కి తిరిగి చూసింది. నేను నెమ్మదిగా ఆవిడ కంచుకంమీదికి కరం పోనిచ్చాను......”

“నీలకంఠం, నువ్వురా మనిషివంటే! చాలు అంతమట్టుకు, పేరు నిలిపావు!”

“అబ్బ ఏమిటండీ! దయచేసి వెళ్ళుదురూ!” అని నా చెయ్యి నెమ్మదిగా యివతలికి నెట్టింది. ఇంతలోకే వాళ్ళ కుర్రాడు కళ్లు నులువుకుంటూ కిటికీదగ్గిరికి వచ్చాడు.”

“ఓరి పానకంలో పుడక వెధవా! అప్పుడే లేవాలిట్రా, ఈపిల్ల వెధవలు పడిపోయినట్టు మంచిపట్టులోనే అడ్డంవస్తారు! వీళ్ళని తగలెయ్య!”

"శ్రేయాంసి బహువిఘ్నాని. ఏం చేస్తాం మరి! ... ఇంక యువ్వాళకు లాభం లేదని మనం వెనక్కు తగ్గాము."

ఇంతలోకే వెంకట్రావు వచ్చాడు.

"ఏం ఇలా దయచేశావు. పొద్దున్నే! చా! దా! కాఫీ పీల్చావా?" అన్నాడు రంగారావు.

"అయిందిరా కాఫీ! శ్వేతసమిధ ఒకటి యిలా పారవెయ్యి" అన్నాడు వెంకట్రావు, మేజాపక్క కుర్చీలో కూర్చుంటూ.

"తరవాత ఏమైంది?" అని రంగారావు వెంకట్రావును చూసి, "ఒరే! మంచిపట్టులో వున్నాంరా మేము" అని నవ్వాడు.

"రంగడూ! మంచి పట్టున్నప్పుడల్లా కామినగోష్ఠి కాక యింకే ముంటుందిరా మనకు! ఒరే నీలకంఠం! నీవాలకం చూస్తే ఏదో దండయాత్ర చేసి దెబ్బ తిన్నట్టు కనబడతావేం? అన్నాడు వెంకట్రావు నవ్వుతూ.

"నీదగ్గర ముఖవైఖరీవిద్య వున్నట్టుందోయి! బాగా కనిపెట్టావు. మనవాడికి కొద్దిగా శృంగభంగ మైందిలేంరా మధ్య" అన్నాడు రంగారావు, వెంకట్రావు నోట్లో సిగరెట్టు ముట్టిస్తూ.

నీలకంఠంకూడా సిగరెట్టు వెలిగించి రెండుదమ్ములు లాగి "ఏముందిరా తరువాత చెప్పేందుకు? పొద్దెక్కి లేచిన సంగతి నీకు తెలుసునుగదా. కాఫీసేవ అయినాక ఆపిల్ పండు

కొయ్యడానికి చూస్తే చాకు లేదు మేజామీద. చాకు అడిగి నట్టూ అవుతుంది. జానకి వైఖరి చూసినట్టూ అవుతుంది. అని పక్క భాగంలోకి వెళ్ళి, ఏమండీ! చాకిస్తారా ఒకమాటు అన్నాను మృదువుగా"

"ఒక పట్టున వదలిపెట్టే ఘటానివి కావే! స్వహస్తా లతో తెచ్చి యిచ్చిదనుకుంటాను చాకు" అన్నాడు రంగా రావు మీసం దువ్వుతూ.

"ఇదేదో గ్రంథం చాలామూరం నడిచినట్టుందే. నెల నెలకూ మాసపత్రికలాగా నీ కథేదో పరిచురణ అవుతూ వుండవలసిందేనా ?" అన్నాడు వెంకటరావు నీలకంఠం కేసి చూస్తూ.

"ఒరే ! నీకు సంగతిసందర్భాలు తెలియవు, అడ్డురాకు. జానకి తలెత్తి చూసి యింతలోకే దగ్గరకొచ్చిన కుర్రాడితో నీలకంఠంగారికి చాకు తీసుకొని వెళ్ళి ఇయ్యి! అన్నది. వాడు తెచ్చి నాకిస్తూ, తెల్లవారుఝామున మా కిటికీదగ్గిరికి వచ్చారెందు కండీ? అన్నాడు"

"అరి ! వెధవా ! నిన్ను చూశాడురా వీడు, నీలకంఠం! అప్పుడు ఏమన్నావేమిటి ?" అన్నాడు రంగారావు ఆదుర్దాగా.

"పెద్దాళ్ళసంగతి నీ కెందుకోయి, అంటూ ఆపిల్ పండు కోసి వాడి కొకముక్క పెట్టాను."

"పాపం, స్వహస్తాలతో ఆవిడకుకూడా ఒక ముక్క నోటికి అందజెయ్యక పోయినావా?" అన్నాడు రంగారావు ఉత్సాహంతో.

"ఆ అదృష్టం పట్టలేదోయి మనకు! ఆవాళ కాళపోతే మానె, కొన్నాళ్లు తాళి జైత్రయాత్ర చేతామనుకుంటే నీ రిపోర్టు వచ్చె ఇంతలోకె." అన్నాడు నీలకంఠం, పొగ వలయాలుగా వదులుతూ.

వెంకటరావు ఆశ్చర్యంతో "రిపోర్టు ఏమిట్రా రంగడూ! నాకుకూడా కాస్త చెబుదూ! మనవాడి తెలివితేటలేమిటో గ్రహిస్తాను." అని అడిగాడు. రంగారావు కథ టూకీగా చెప్పాడు. వెంకటరావు "ఏమో వింతగా వుందిరా! మధ్య కుర్రది మంచిదిలాగానే కనపడుతుంది. నీలకంఠంగాడు ఏదో అడావిడీచేసి కొంత జముకు పుట్టించాడు. వీడెప్పుడూ యింతే!" అన్నాడు కళ్లు తుడుచుకుంటూ.

"నువ్వో, ఎప్పుడూ యింతే. ప్రతివాళ్ళకూ కాండక్టు సర్టిఫికేట్లు ఇస్తూ ఉంటావు. ఆవిడ యింత మంచిదైతే మన వాణ్ణి ఇంతయెత్తు ఎక్కనియ్యడ మెందుకు?" అన్నాడు రంగారావు.

"ఆవిడేం, వీణ్ణేమి పిలిచిందా? తలుపు తీసిందా ఏమన్నా? వీడే వూరికే చొచ్చుకు వెడుతూ ఉంటాడు" అన్నాడు వెంకట్రావు.

"ఆ క్షుద్రవెధవ మేలుకున్నాడు కాబట్టి సరిపోయింది. కాని..." అన్నాడు రంగారావు.

"అయితే నీ భార్యతో జానకి యెందుకు రిపోర్టు చెయ్యాలి?" అని వెంకట్రావు ప్రశ్న. "రోగి చస్తూంటే డాక్టర్ల చర్చలాగ నా పరాభవంమీద మీ కెందుకింత పెద్ద శాస్త్రచర్చ" అన్నాడు నీలకంఠం.

"నీవు చేసేపని చేస్తే బాగానే వుంది, మేము చర్చ చేస్తే వచ్చిందేం!" ఆక్షుద్రుడు ఎవరితోనన్నా చెవుతాడేమో నని జానకి నా భార్యతో రిపోర్టుచేసి ఉంటుందోయి. అయితే నీలకంఠం, నువ్వు ఈ పరాభవం సహించి వూరుకోవలసిందేనా?" అన్నాడు రంగారావు కోరచూపు చూస్తూ.

"ఒరే! స్థానాస్థానా భేదం వుండవద్దుట్రా! మరో ఇంట్లోనే-అయినట్లైతే మజా చూపించేవాడిని! ఇహా విరమించాను." అన్నాడు నీలకంఠం వెంకట్రావు కేసి చూస్తూ.

"విరమించ కేమిటోయి, వెర్రినాగులు నీవు చేసేది!" అని వెంకట్రావు చిరునవ్వు నవ్వాడు.



# ఆచారికీ ఔరత్

## ౧

నిజానికి ఆచార్లుగారి భార్యా చాలా అందమైన మనిషి. ఒంగోల్లో ఆవిడికి సాటివచ్చే ఆడమనిషి లేకపోగా, సమీపానికి రా దగ్గదికూడా లేదు.

ప్రకృతి అంతా అపమార్గాన వెడుతూన్నట్టు కనబడుతుంది. లోకంలో సరియైన పదార్థాలకు సమ్మేళనం ఉండదు. ఎక్కడచూసినా ఎగుడుదిగుడే! దంపతుల సంగతి ఆలోచిస్తే, పొడుగాటి భర్త ఐతే భార్య పొట్టిది; భార్య లావాటిదైతే, భర్త సన్నటివాడు; ఒకరు ఎరుపైతే రెండోవారు నలుపు. అంత చక్కదనాల తాయారమ్మకు అటువంటి అనాకారి ఆచార్లు గారిని కట్టబెట్టి ప్రకృతినిందకు పాత్రమైంది.

ఉత్సాహవంతులైన కొంతమంది యువకులు పౌరుషంతో కోరమీసం మెలివేస్తూ ఆమెకు ఈ చెర తప్పిస్తే బాగుంటుందని అప్పుడప్పు డంటూ ఉండేవాళ్లు, ఐతే, గవర్నమెంటు మంచి బందోబస్తు అయింది కావడంచేత పడుచువాళ్ళ పరోపకారబుద్ధి, భర్తృహరి అన్నట్టు "జీర్ణమంగే సుభాషితం"

లాగ అయిపోయింది. కావ్యాల్లో కటాక్షవిశిఖాలవల్ల అనేక మందికి ప్రాణాపాయం కూడా సంభవించే అంత సంరంభం జరుగుతుంది. ఐతే అది స్త్రీ పక్షం. ఇక్కడ తరుణవయస్కుల దృగ్బాణాలు నిజంగా పనిచేస్తే ప్రతిరోజూ ఆచార్లుగారు ఐదారుసార్లు అమరావతికి వెళ్ళి రావచ్చు.

లక్ష్యభేదాన్ని బట్టి ఒక్కొక్క వస్తువును ఏకకాలం లోనే విరుద్ధగుణాలు ఆశ్రయిస్తవి. భర్తమీద బాణానలం వలె పడే యువకదృక్కులే భార్యమీద పడేసరికి "పారిజాత ప్రసవమాలాబహుళ మిత్యాదియే!" లాగ అయి పొయ్యేవి.

సందడి తక్కువగా ఉంటే ఒక్కొక్కప్పుడు తలనొప్పి కలగవచ్చు ధ్వని అఖండం అయిపోతే శాంతే! తరుణవయస్కులు ఒకరిద్దరు చూస్తూన్నప్పుడు కొంత ఆందోళన పడేది. తాయారమ్మను. వ్రితి ళ్ళా చూడడం మొదలు పెట్టాక ప్రశాంతి అనుభవించింది. అన్ని పక్కలా కామాతురులు కళ్ళలోనుంచి ప్రాణాలు విడుస్తూ ఉంటే ఆవిడ "నివాత నిష్కంప మివప్రదాపం" "లోకము గర్హణ శ్రవణలోలుప మెల్లపుడున్! విఫల మనోరథులు వెయ్యి విధాల పరీవాదాలు ప్రచారం చేస్తారు. చిత్తు అయినా స్పోర్ట్స్‌మన్‌స్పిరిట్‌తో తీసికునేవాళ్ళు బహు కొద్దిమంది. కాముకులు పరాజయం భరించలేరు. "యత్నేకృతే యది న సిధ్యతి కోఽత్ర దోషః"

వీధివెంట వెళ్ళే వృద్ధులుకూడా వెనక్కు వెనక్కు తిరిగి ఆమెను అక్షులతో ఆలింగనం చేసుకోకుండా ఉండలేరు.

ఒకనాడు వయసుమీరిన ఓ పెద్దమనిషి ఆమెను మిర్రిమిర్రి చూస్తూ పోతూంటే దగ్గర ఉన్న తరుణి ఒకతె "వదుచు వాళ్లుసరే! ఈముసలాయనికి ఏంపొయ్యే కాలం వచ్చింది! అలా మిడిగుడ్లు పెట్టుకు చూస్తాడు?" అని నవ్వింది. ఏ ఇంద్రియం చేయవలసిన పని ఆ ఇంద్రియం చేయకుండా ఎలా ఉంటుంది?

"వరస్త్రీకుచకుంభేషు
కుంభేషు రిపుదన్తినామ్
నిపతన్తి వ భీరూణాం
దృష్టయ శ్శరవృష్టయః"

సిసలైన శిష్టుడికి స్వరాజ్యం అక్కర్లేనట్టు శివరాంకి ఒక్కడికిమాత్రం ఆవిడమీద ఆసక్తి లేదు. పహలా పచ్చీస్ లో ఉన్నవాడు, స్ఫురద్రూపి, స్పోర్ట్స్‌మన్, కవితాప్రియుడు, శివరాం నిజంగా లోలుపదృష్టులు గల యువతులకు లోభనీయుడే! ఆచార్లుగారి భార్య ఆతని కేసి చూసిన చూపులన్నీ లెక్కపెట్టి పుస్తకం కింద రాసి భద్రాద్రి దేవళంలో దాఖలు జేయవచ్చు! ఆ చూపుల్లో అనురాగం ఉందో అపత్య వాంఛ ఉందో ఆవిడకే తెలియదు. శివరాం కొడుకు దబ్బ పండులాగ ఉంటాడు. ఉన్నవా డూరుకోక తన లాంటి పిల్లలు ఇతర్లకి పుట్టాలని మనస్సులు రవులుకొలుపుతాడు. ఆచార్లుగారి అర్థాంగికి అంతవరకు సంతానం లేదు. హైస్కూల్ నుంచి ఇంటికి రాగానే శివరాం అన్నపూర్ణ చేతుల్లోంచి అబ్బాయి,

వందుకుని ముద్దు లాడుతుంటే తాయారమ్మ తదేకధ్యానంతో చూస్తుంది. అతనికి మట్టుకు అన్యదృష్టి లేదు.

శివకేశవులకు అభేదం సూచించే స్మార్తుల్లాగ చాలా మంది శివరాంకూ తాయారమ్మకు అవినాభావ సంబంధం కల్పించారు. నిజానికి లోకం అంతా వ్యాపించిన ద్వైతమే అక్కడ కూడా అనువర్తిస్తుంది. అందుకు అన్నపూర్ణ అనురాగమే ఆధారం. అద్వైతం సిద్ధించిన ఆ దాంపత్యానికి అన్య ధర్మాలేవీ ఆటంకాలు కావు.

పొరుగిల్లే అవడంవల్ల ఆచార్లుగారు షాహుకారు కొట్టుకు వెళ్లగానే తాయారమ్మ గృహకృత్యాలు నిర్వర్తించుకుని అన్నపూర్ణమ్మతో పచ్చీసు ఆడడానికి వచ్చేసేది. కొంతసేపు వాళ్ల కుర్రవాడికి తల దువ్వి ఆడిస్తూ కాలక్షేపం చేసేది. శివరాం హైస్కూల్లో సైన్సు అసిస్టెంటుగా ఒంగోలు వచ్చింది మొదలు ఆ రెండు కుటుంబాలకీ జోస్తీ ఏర్పడింది. ఆవిడ శివరాంతో మాట్లాడుతూ ఎబ్బెరికం లేకుండా ప్రవర్తిస్తూ ఉన్నా భర్తహృదయం అవగాహన చేసుకున్న అన్నపూర్ణకు అనుమాన లేశం కూడా లేదు.

౨

మైకల్ మస్ సెలవు లిచ్చిన మొదటిరోజున పోస్టు జవాను "మహారాజ్ ! ఖత్ హై" అని శివరాంకి ఉత్తరం ఇచ్చి సలాం చేసి వెళ్లాడు. శివరాం ఉత్తరం చదివి బిగ్గరగా

నవ్వుతుంటే "ఏమి టండీ!" అన్నది అన్నపూర్ణ దగ్గిరికి వచ్చి.

"నీలకంఠం ఉత్తరం రాశాడు."

"ఏమిటీ! ఏమంత నవ్వొచ్చే సంగతు లేమి రాశాడు? ఐనా సరదా మనిషి."

"వస్తున్నా నని రాశాడు."

"మద్రాసునుంచేనా?"

"ఊఁ పాసింజరులో దిగుతున్నాడు."

"అయితే అంత నవ్వాలసి ఎందుకు వచ్చింది? చదవండి, ఏం రాశాడో."

"వచ్చుచున్నారు - వచ్చుచున్నారు - బ్రహ్మశ్రీ వేదమూర్తుల నీలకంఠదీక్షితుల వారు - మంచి తరుణం - పోగొట్టుకొనకుడు - మూడుఘంటలకు - ధూమ శకటికలో - విజయం చేయుదురు - వీలైనచో మేళతాళములతో, స్వాగత తోరణ మాలతో ఆహ్వానించుడి——నీ. నీ."

అన్నపూర్ణ నవ్వాపుకోలేక భర్తచేతిలో ఉత్తరం తీసుకుని, "ఈ నాలుగు ముక్కలికీ కవరెందుకు? దండుగ! ఐనా సర్కస్ కంపెనో, స్వాములవారో, మీ స్వరాజ్యపు నాయకులో వస్తున్నట్టు - మీ స్నేహితు లంతా చాలా తమాషా వాళ్ళు!" అని కుర్చీలో కూర్చుంది. శివరాంభార్య బుజాల మీద చేతులానించి "రాణీ సాహెబావారికి శ్రమ"

"శ్రమ?"

"మనవాడు మూడుఘంటలకు దిగుతాడు. భోజనం చెయ్యకుండా వస్తాడేమో. తాము రెండుగంటలకు కా

చెయ్యి చేసుకోవాలసి వస్తుందని విన్నవించుకోడానికి విచారి స్తున్నాం."

"మీ దంతా అర్జీదాఖలు చేసుకుంటున్నట్టు?"

"అమ్మమ్మ! ఎంతమాట! ఈ రోజుల్లో ఆడవాళ్ళను క్షమించాలి - స్త్రీలను—"

"ఏం, ఆడవాళ్ళంటే తప్పా?"

"కాదు మరీ! ఆమధ్య గుంటూరు గాంధీపేట స్త్రీ సమాజం వారు, ఎవరో ఆడవాళ్ళను ఆడవాళ్ళంటే, "అలా అనకండి, స్త్రీ లనండి" అని మందలించారట."

"స్త్రీలకూ ఆడవాళ్ళకూ ఏమిటి తేడా?"

శివరాం చిరునవ్వుతో "స్త్రీలంటే చాలా భయం నాకు ఆడవాళ్ళంటే అభిమానం" అన్నాడు.

"మాడల్ లేదేం! అయినా ఆడవాళ్ళంటే ఒంటికాలి మీద బయలుదేరుతారు, మీ మొగాళ్ళు."

"స్త్రీలంటే చదువుకున్నవాళ్ళు — ఆడవాళ్ళంటే మామూలూ..."

"అంటే నాలాంటి వాళ్ళన్నమాట!"

"అమ్మమ్మ, ఎంత మాట! తాము స్త్రీలే కాక మహా స్త్రీలు కూడాను!"

"చాల్లెద్దురూ! నేను మహాస్త్రీని, మీరు మహాపురుషులు!"

శివరాం భార్య చెక్కిళ్ళు చేతుల్తో నిమురుతూ, "నన్ను మామూలు మగవాళ్ల లిష్టులో వేతూ, చాలు" అని బతిమాలు కుంటున్నట్టు ఆమెగడం పట్టుకున్నాడు.

"నయం! మీమహత్వం మీకు తెలియదు. మీరు మాయామానుష విగ్రహులు కేవలం—"

అంటుండగానే తాయారమ్మ వచ్చింది. అన్నపూర్ణ కుర్చీలో నుంచి లేవబోతూంటే ఆమె బుజాలమీద అరిచేతులు పెట్టి కొద్దిగా అదిమి "రాణీసాహెబావారు కుర్చీలో కూచునే ఆజ్ఞాపించాలి" అన్నాడు శివరాం.

"ఏ మదృష్టమండీ! అక్కగారూ మీది! మా వారు మైలుదూరంలో ఉండగానే నేను లేచి నిల్చోవాలి – శివరాం గారిని మాయామానుష విగ్రహ లంటున్నారేమిటి?" అన్నది తాయారమ్మ.

"కూర్చోండి అక్కగారూ! మావారు ఎంత గొప్పవా రనుకున్నారు! ఎల్. టి. కి పూర్వం బి. ఏ., బి.ఏ., కి పూర్వం ఇంటర్, ఇంటర్‌కు పూర్వం స్కూల్ ఫైనల్—అబ్బా, ఎన్ని పరీక్షలు ప్యాసయ్యారనుకున్నారు!" అని నవ్వింది.

"మీ కేమండీ అక్కగారూ! వారి నలా అంటారు కాని, అనేకదండయాత్రలు చేసి మూడోఫారం దాటని మొన గాళ్లు అనేకమంది! మావారు—" అని తాయారమ్మ అంటూంటే.

"ఎందుకండీ ఈ పిచ్చి చదువులు! ఉన్న నాలుగెక రాలూ అమ్ముకుని, చదివి, ఉద్యోగాలకోసం ఆఫీసులూ కని పించే ప్రతికొంప మెట్లూ ఎక్కి దిగి, నానా అగచాట్లూ పడ షంకన్న శుభ్రంగా ఇంటిపట్టున ఉండి పదిరాళ్ళు తెచ్చు కోవడం మేలు మీవారి కేంలోటు, మీకేం లోటు? ఒంటి నిండా నగలూ. మాపూర్ణ చూడండి, నిరాభరణ సుందరం" అన్నాడు శివరాం.

"ఇలా ఉండనిత్తురూ చాలు." అన్నది అన్నపూర్ణ చెయ్యి ఆడిస్తూ.

"మీరే మా అక్కగారికి అన్ని ఆభరణాలు!" అన్నది తాయారమ్మ, కనుబొమ్మలు తిప్పుతూ.

"కడుపు నిండింది! — సరి, మరి వంటమా టేమిటి?" అన్నాడు శివరాం.

"చేయుబడును!" అన్నది భార్య, భర్తకేసి చూస్తూ.

"రెండింటికి వంటెందుకండీ అక్కగారూ? ఎవరైనా చుట్టాలు వస్తారా?" అని తాయారమ్మ అడిగింది.

"మా వారి స్నేహితులు, నీలకంఠంగారు వస్తారు"

"నీలకంఠంగా రంటే ఆ ఫొటోగ్రాపులో వారేనా?" అని తాయారమ్మ గోడకేసి చూసింది.

"ఆఁ!"

"నేను వారి నెరుగుదును."

"ఎలా ఎరుగుదురు?" అన్నాడు శివరాం.

"మాదీ వారిదీ ఒక ఊరే‌– ఇరుగుపొరుగిళ్ళు. చూసి చాలా రోజు లయింది. ఆయన నేం చేస్తున్నా రిప్పుడు?"

"ఎఫ్. ఎల్. చదువుతున్నాడు."

"చాలా సందడి మనిషి. ఏవో కబుర్లు చెపుతూ, నవ్విస్తూ ఉండే వాడు."

తరవాత అన్నపూర్ణా తాయారమ్మా పచ్చీసాటకు కూర్చున్నారు. శివరాం గదిలోకి వెళ్ళి పడుకుని, "దేవిగారు ఆటలో కాలం గమనించ రేమో! రెండింటికి ఆలారం పెట్ట మని సెలవా?" అన్నాడు.

"అచ్ఛా" అన్నది గృహిణి.

3

వాకిట్లో బండిచప్పు డైంది. తాయారమ్మా, అన్న పూర్ణా హాలుగుమ్మం వద్దకు వచ్చి నిలుచున్నారు. వీధి తలుపు తెరచుకుని శివరాం, నీలకంఠం లోపలికి వచ్చారు. బండి మనిషి సూటుకేసూ మూతబుట్టా, పట్టుకు వచ్చాడు. స్త్రీలు లోపలికి తప్పుకున్నారు.

"నీలకంఠంగారూ, బాగున్నారా?" అని అడిగింది అన్నపూర్ణ.

"ఆఁ" అని హాలులోకి వచ్చారు స్నేహితు లిద్దరూ కోట్లు తీసివేసి, కుర్చీలలో కూర్చున్నారు.

"భోజనానికి లేస్తావుటోయి" అన్నాడు శివరాం.

"భోం చెయ్యం. స్నానం మట్టుకు చెయ్యాలి."

"అదేమిటోయి, మీావదినగార్ని శ్రమ పెట్టి వంట చేయించాను కూడా."

"శ్ర మేమిటీ! ఐనా వంటయిందిగా!"

"మనకు భోజనం నైమిత్తికాలంలోది. గూడూరు లోనూ, బిట్రగుంటలోనూ దాణా బాగా పడ్డది."

"ఇప్పుడు భోం చెయ్యకపోతివా రాత్రికి మీావదిన గారు ఈవంటే నీనోటిని వేసి కడుతుందేమో అబ్బీ!" అన్నాడు శివరాం నవ్వుతూ.

భర్తమాటలు అందుకుని అన్నపూర్ణ నీలకంఠాన్ని వేలుతో బెదిరిస్తూ "మరిదిగారూ! మర్యాద దక్కదండోయి! నిజంగానే నోట వేసి కట్టాలిసి వస్తుంది. గుర్రాలకి దాణా సంచిలో వేసి మూతికే కాదండీ! కట్టేది?" అన్నది.

"దొరికిపోయాను! దాణా అన్నందుకు తగినశాస్తి చేశారు!" అన్నాడు నీలకంఠం జుట్టు సవిరించుకుంటూ.

ఇంతసేపూ కొంత వెనకాల నిలుచున్న తాయారమ్మ ఒక అడుగు ముందుకు వేసి "అక్కగారూ! వారి నెందుకు శ్రమ పెడతారు? ఈ వేళప్పుడు భోజన మేమిటె, ఏదో కాస్త కాఫీ ఇయ్యాలిగాని!" అన్నది.

"అరె! ఆచారికీ ఔరత్ క్యా!" అన్నాడు నీలకంఠం, తాయారమ్మని తేరిపారచూసి.

"నయ్యమే! జ్ఞాపకం వచ్చాం."

"ఆయ్ ఖుదా! మిమ్మల్ని మరిచిపోవడమే! అయితే అలివేలమ్మగారూ, క్షేమమా?"

"మంచి జ్ఞాపకశక్తండి మీది! నన్ను మాంఅమ్మమ్మని చేశారు."

"నహీ నహీ, నాంచారమ్మగారూ, బాగున్నారా!"

తాయారమ్మ చిరునవ్వుతో "నాపని నాంచారమ్మలోకి వచ్చిందా!" అన్నది.

"చూడండీ, చూడమ్మగారూ!"

"మరిది గారికి మంచి జ్ఞాపకశక్తిలా ఉంది!" అన్నది అన్నపూర్ణ.

"మరచిపనేది యువకుల లక్షణం" అని వ్యాఖ్యానం చేశాడు శివరాం.

నీలకంఠం తల గీరుకుంటూ "ఉండండి, ఆండాళమ్మగారూ – కానట్టుందే – తికమక పెడుతూంది. తిరుమలమ్మగారూ – నహీ నహీ, తోబా తోబా! చూ, చూ, చూడికుడిత్తమ్మగారు!" అని ఆకాశంకేసి చూశాడు.

"మా వైష్ణవ ఆడవాళ్ళ పేర్లన్నీ అయిపోలేదే!"

"ఏమిటోనండీ, మీ వాళ్ళ పేర్లన్నీ ఒకలాగే ఉంటాయి, తెల్లవాళ్ళ మొహాల్లాగ."

"తల్లకిందులై పోతున్నారు. పాపం, పేరు కనుక్కోడానికి!" అన్నది అన్నపూర్ణ.

" తమాం భాల్గయా ! తాయారమ్మగారూ ! "

" అమ్మయ్య! చివరకు పట్టావోయ్ " అన్నాడు శివరాం స్నేహితుణ్ణి అభినందిస్తూ.

" సహస్రనామజపం చేయించారు గదండీ నాచేత !— అయితే ఆచార్లుగారు ఖులాసాగా ఉన్నారా ? " అన్నాడు నీలకంఠం.

"ఏడు సంవత్సరాలైందనుకుంటాను మిమ్మల్ని చూసి"

" అయింది. అందుకే, తత్వంకూడా ఫిరాయించి నట్టుంది. "

" క్షమించాలి, అన్నూరూ ఈన్నూరూ తిరిగేవాళ్ళం. ఏదో అనేకమంది కనిపిస్తూ ఉంటారు ; పేరు కాస్త అడుగున పడింది. "

" మీరు పెద్ద లాయరు కాబోతున్నారు. మాబోటి వాళ్ళం జ్ఞాపకం ఉంటామా ! "

" అలా అనడం ధర్మమా ! మరచిపోదగ్గ మనుష్యుల్లో వారు కారు మీరు. "

" స్నానానికి లే మరి " అన్నాడు శివరాం. నీలకంఠం లేచి " బాడీ " తీస్తూ " నూతులో నీళ్లేమైనా ఉన్నాయా ? మునుపు చాద వేస్తే మెక్సికోవాళ్ళ కందేది " అన్నాడు. అన్నపూర్ణమ్మ అందుకుని మాదొడ్లో నూతికి ఆచిక్కేం లేదు. పైగా తోట్టినిండా నీళ్ళు తోడి ఉన్నాయి. సబ్బుబిళ్ళ పెట్టె అక్కడే ఉన్నది, " అన్నది.

నీలకంఠం స్నానానికి వెళ్ళాక తాయారమ్మ. "అక్క-గారూ, ఆయనకి కాఫీ పెడదామా?" అన్నది.

"నీలకంఠం కాఫీ విసర్జించాడు టీ పెట్టు" అన్నాడు శివరాం భార్యతో.

ఇంతలోకే చంటివాడు లేచాడు. అన్నపూర్ణ వాణ్ణి ఎత్తుకో బోతూంటే "పిల్లవాడితో మీకు తెముల్దు. నేను పెడతానులెండి టీ," అన్నది తాయారమ్మ.

## ౪

స్నానంచేసి వచ్చి నీలకంఠం గదిలోకి వెళ్ళి క్రాపు దువ్వుకుని షరాయి తొడుక్కుని షర్టువేసుకుని కుర్చీలో కూర్చున్నాడు. స్నేహితులు ఇష్టాగోష్ఠి చేస్తున్నారు. టీ తయారు చేసి తాయారమ్మ మేజామీద కప్పులు పెట్టింది.

"థాంక్స్," అని నీలకంఠం టీ తాగుతూ "మంచి పాకాన పడ్డదండీ, చేతితీరు," అన్నాడు.

"పల్లెటూరి వాళ్ళం! మీ అవతారం మారిపోయిందేమండి? వెనకటిసారి షరాయిలు తొడిగినట్టు లేదు మీరు,"

"ప్రస్తుతం మనం ధోవతీ విసర్జించాం. అసలు ఇండియాలో యావన్మంది పురుషులూ, షరాయిలు తొడిగితేనే గాని స్వారాజ్యం రాదు. చూడండి, తుర్కీలో ముస్తఫా కమాల్ పాషా టోపీ తీయించి హాట్ పెట్టించాడు దేశమంతా—"

"ఐతే మనంకూడా మ్లేచ్ఛుల మైపోవా లంటారా?"

"మనకంటే వాళ్లే నయం. అసలు ఇండియాలో ఉండే అన్ని ప్రాంతాల్లో మొగవాళ్ళూ - బ్రాహ్మలూ ఏం కట్టు కుంటారో చాలామందికి తెలియదు. సింధులో మొగవాళ్ళూ ఆడవాళ్ళూకూడా షరాయిలు తొడుగుతారు. సనాతన ధర్మ వాదులైన మాలవ్యాజీ ఇంకా అనేక మంది మహా పురుషులూ లాగూలే తొడుగు తారు."

"అయితే ఆడవాళ్ళ చేతకూడా లాగూలు తొడిగించే లాగున్నారే మీరు!" అన్నది తాయారమ్మ నవ్వుతూ.

"లాగూలు కాదు, లంగాలు కడితేమంచిది. ఆ తెల్ల వాళ్ళ దేశాల్లో చూడండీ—"

"మావాణ్ణి కదిలిస్తే ఇండియా మొత్తం మీద ఉంటుంది దృష్టి. టకీ మని స్వరాజ్యం వచ్చే సూత్రం చెప్పేస్తూ ఉంటాడు!" అన్నాడు శివరాం.

"ఎందు కండీ, మీ ఖద్దరు చీర ఎంత బాగున్నది! ఇండియా యావత్తూ ఖద్దరు కట్టుకుని, దంపుడు బియ్యం- పోసి విసిరిన గోధుమలు- తింటేచాలు; కొన్ని కోట్ల మందికి జీవనాధారం దొరుకుతుంది."

"ఇంకా రెండుమూడు సెలవియ్యి స్వరాజ్యం వచ్చే చిట్కాలు" అన్నాడు. స్నేహితుడు చిరునవ్వుతో.

"ఏకభాషా, ఏక లిపి. ఘాజీ ముస్తఫా మూడువారాల్లో, తుర్కీలిపి మరిచిపోయి, రోమన్ లిపి నేర్చుకోవలసిందని దేశానికి హుకుం ఇచ్చాడు."

అన్నపూర్ణ కుర్రవాణ్ణి ఎత్తుకు వచ్చింది శివరాం పిల్ల వాణ్ణి అందుకున్నాడు. నీలకంఠం స్నేహితుడితో "తుంహారా బేటా! ఖూబ్ సూరత్ – హై నాం క్యాహై తేరా బాబా!" అని పిల్లవాడి బుగ్గ పట్టుకున్నాడు.

"పేరింకా ఏమీ నిర్ధారణ చెయ్యలేదోయి వీడికి–"

"రాస్, హ్యూమ్, గాంధీ, గోఖ్లె, నానా పడ్నవీస్,"

"నీదంతా వవ్వులాట. ఇంటి పేరుతో కలిసేది పెట్టాలి."

"ఉన్నారుగా మన పూర్వకవులు: తిక్కన్న, తిమ్మన్న పోతన్న, యెర్రన్న, నల్లన్న.—"

"సుబ్బిసెట్టి కవిగాణ్ణి ఇంటికి రానీ యొద్దన్నాడు మనం కవిగాడి పేరు కుర్రాడికి పెట్టం."

అన్నపూర్ణ మందహాసం చేసి మీ అన్నగారివన్నీ బులి బుచ్చికవు మాటలు, వీరికి కవిత్వం అంటే చాలా ఇష్టమే కాకుండా స్వయంగా కూడా కవిత్వం మొదలు పెట్టారీమధ్య" అని రహస్యం బయటపెట్టింది.

"ఏమిటీ, చెప్పవూ! నీ సైన్సుకూ కవిత్వానికి ఎలా ముడివేశావోయి?"

"నిజమైన కవికి సైన్సు తెలిసితీరాలి. సైన్సులో ఎంత కవిత్వం ఉంది."

"అయితే మీరు రాసినవి నాలుగు పద్యాలు చదవండి వింటాం" అన్నది తాయారమ్మ, అన్నపూర్ణమ్మ పక్కన అరుగుమీద కూర్చుని.

"ఈ పిచ్చికవిత్వాలకేం! ఈ రోజుల్లో పద్యం చెప్ప లేని వాళ్లెవరు, ఆంధ్ర దేశంలో?"

"వినిపించవోయి వేధించక" అన్నాడు నీలకంఠం.

"సభవారు ఆజ్ఞాపించుచున్నారు!" అన్నది అన్నపూర్ణ

"—కాదు ప్రార్థించుచున్నారు." అన్నది కాయా రమ్మ.

"దీక్షితులవారు రెండునూ చేయుచున్నారు" అన్నాడు నీలకంఠం.

శివరాంకంఠం మంచిది. అతను పద్యాలు శ్రావ్యంగా చదువుతాడు. "తప్పదన్న మాటేనా? సరి" అని శివరాం ప్రారంభించాడు.

"తరుణి తరుణారుణారుణాధరము పెదవి,
క్షేల మధుపాత్ర, పరచింత లేల నాకు?
పూజ లేల? కాలాలయమునకు నేగి
మరలి వచ్చిరా ఎవరేని..."

"ఏమిటోయి, ఉమర్ ఖయ్యాం ధోరణిగా ఉందేం!"

"తత్వవేత్త అంటే వాడే నయ్యా!"

"............ రాని రేపు
చచ్చిపోయిన నిన్న: యోచనల వేల?"

"తెలుగులో ఖయ్యాం తర్జుమాలు వచ్చాయి చూచావా?"

"ఆఁ! సుబ్బారావు, రామిరెడ్డి, నారాయణరావు... ఇత్యాదయః చేశారు."

"భగవద్గీతలాగ పాకెట్ ఎడిషన్స్ వేయించి పంచిపెట్టిం చాలోయి దేశంమీద ఉమర్ ఖయ్యాం పద్యాలు...... యింకేమేనా చదువు."

"ఆమె నిదురించుచుండె శయ్యాతలాన:
ప్రేమ మొలికించు చెక్కిళ్ళ వింతరంగు
పూతలే కప్పుకొన్నది, మూతవడిన
కనులతో మూగవారిన గళముతోడ
వేచుకొనె ప్రాచికొరకు.......''

"ఏకవి చూసినా ఆడవాళ్ళని గురించే రాస్తాడే - మరేం లేనట్టు" అన్నది అన్నపూర్ణ.

"కామిని లేని కవిత్వం ఏమిటండీ! కామిని- కవిత్వం; కవిత్వం- కామిని!" అన్నాడు నీలకంఠం.

"మీ మగవాళ్ళు రాస్తే మమ్మల్ని గురించేగా అన్నది తాయారమ్మ కోరచూపు చూస్తూ.

"మీ ఆడవాళ్ళు రాస్తే మమ్మల్ని గురించి రాయ రేమో అనుకుంటాను" అన్నాడు నీలకంఠం హేళనగా.

౫

సాయంత్రం స్నేహితు లిద్దరూ కొండమీదికి వెళ్ళి దేవాలయాలు చూసి కాస్సేపు క్లబ్బులో కూర్చుని చీకటి

పడ్డాక ఇంటికి వచ్చారు. నీలకంఠం పగలు భోంచెయ్యక పోవడం వల్ల పెంగదలాడే భోజనానికి తేవదీశాడు శివరాం.

ఖులాసాగా కబుర్లు చెప్పుకుంటూ వాళ్ళు సాపాటు చేస్తుంటే తాయారమ్మ వచ్చింది. "రండి, రండి, మాస్వా ర్తుల భోజనం అపోరకం లెండి. తెర, లడ్డం లేవుగా మీలాగ" అన్నాడు నీలకంఠం.

"మాది వెర్రి మొత్తుకోళ్ళు! మేము అసలు మీ దృష్టిలో బ్రాహ్మలమే కాముగా!"

"అమ్మమ్మ! ఎంతమాట, శ్రీరంగం వెళ్ళండి, మీ వాళ్ళ ప్రభావం, ఓ!"

"అక్కడికి పోతే ఆంధ్రవైష్ణవులను తేలిగ్గా చూస్తారు. వడక్కు త్రిక్కుమాళ్ అంటారు."

"నాకు మట్టుకు మీ రంటే పూజ్యభావమే సుమండీ."

"పూజ్యభావ మంటే సున్నా అనా?"

"ఆడవాళ్లంటే ఆదరం అండీ!"

"ఇతరుల భార్యలమీద నేనా, మీ భార్యమీద కూడానా?" అని తాయారమ్మ కటాక్ష వీక్షణం ఒకటి అతనిమీద విసిరింది.

చిరునవ్వుతో నీలకంఠం "భార్యంటే పరమాదరం." అన్నాడు.

" ఆమె పే రేమిటండీ ? "

" దాక్షాయణి. "

అన్నపూర్ణా, శివరాం పట్టలేక తెరలు తెరలుగా నవ్వారు. తాయారమ్మ తెల్లపోయి, లేనినవ్వు తెచ్చిపెట్టుకుని " కొంచెం వింతగా ఉంది. కాని మంచిపేరే " అన్నది.

అన్నపూర్ణ ఇంకో తెర నవ్వి, కళ్ళల్లో కమ్మిన నీరు తుడుచుకుని " ఈయన కింకా పెళ్ళికాలేదు ! " అంది.

" అమ్మ దొంగా ! అదా ! పుట్టని బిడ్డలకు పేర్లు పెట్టే ఘనుడి జట్టులోనుంచి వెళ్ళివచ్చా రీయన ! " అని తాయారమ్మకూడా నవ్వింది.

" నాకు పెళ్ళయిందని చెప్పానా ? భార్య అంటే గౌరవం అన్నా గాని. "

" అయితే పే రెలా చెప్పారు ? "

" ఆ పేరుంటే బాగుంటుందని చెప్పాను. "

" అబ్బ ! జరత్కారువు తన పేరున్న మనిషి దొరికే దాకా పెళ్లాడలేదు. నువ్వుకూడా అంతేనా ? " అన్నాడు శివరాం.

" ఒక మోస్తరుగా అంతే. యావదాంధ్రదేశం... "

" కాదు _ కాదు _ యావత్ ఇండియా. "

" రైటో ! ఇండియా యావత్తూగాలించి... "

" దొరక్కపోతేనో ? " అన్నది తాయారమ్మ.

" ఊరుకుంటారు ! " అన్నది అన్నపూర్ణ.

"చిన్న పేచీ వేశావే! ఎలా పరిష్కరించడం ?" న్నాడు శివరాం.

"ఏముందీ, బ్రహ్మచారిగా ఉండిపోతారు" అన్నది తాయారమ్మ.

"కభీ నహీ హో సక్తా! అంటే, అలా ఎన్నటికీ ఉండ[illegible]మాట," అని నీలకంఠం చెయ్యి ఊపాడు.

"అయితే దొరికిన పిల్లకే ఆపేరు పెడతా రనుకుం[illegible]ను." అన్నది తాయారమ్మ.

"ఠీ , థాంక్స్, మంచిసలహా ఇచ్చారు."

"పెళ్ళయ్యాక భార్యని నెత్తిమీద పెట్టుకుంటారు బోలు."

"కిందికి దిగనివ్వడు" అన్నాడు శివరాం.

"కిం దేమిటి, ఆమె ఎక్కడున్నా మననెత్తిమీద ఉన్నట్టే."

"ఈ కబుర్లన్నీ భార్యా వచ్చేవరకే. వచ్చినాక మూడేళ్ళకు భార్యకు పెళ్ళికోసం కొడుతుంది. చూడ్డం లేదూ అనేక మందిని!" దీర్ఘంతీస్తు అన్నది తాయారమ్మ.

"ఏమి టలా సెలవిచ్చారు? భార్యైవ పరదేవతా."

అన్నపూర్ణ పెరుగు తెచ్చి వడ్డించింది.

"భార్య వస్తే ఎన్ని గమ్మత్తులు చేస్తాను, ఎన్ని షోకులు చేస్తాను, ఎన్ని—"

"వెనకటి మోస్తరే. అట్టేమార్పు లేదు మీలో మాటలే గాని క్రియ సున్న" అన్నది తాయారమ్మ పెద విరుస్తూ.

అన్నపూర్ణా శివరాం నిర్ఘాంతపోయి ఆవిడ చూశారు. తరవాత నీలకంఠంకేసి చూశారు. అతను వంచుకుని భోజనం చేశాడు.

కుర్చీల్లో కూచుని తాంబూలం వేసుకుంటున్న మిత్రులు, నీలకంఠం గాంభీర్యముద్ర వహించాడు. అవీ ఇవీ అంటూ ఉన్నా అతని మౌనం తొలగలేదు.

"తబియత్ కైసా హై!" అని శివరాం అడిగా

"బహుత్ అచ్ఛా హై!"

"ఏం మాట్లాడవేం?"

"ఆఁ! ఏం లేదు."

"ఏదో ఆలోచిస్తున్నట్టున్నావే! ఆవిడ అన్నమా టేనా?"

"ఏవిడ?"

ఏమీ ఎరగనట్టు "తాయారమ్మా, నువ్వూ, చిన్నప్పుడు దోస్తీగా ఉండేవారా?"

"ఏదో కులాసాగా మాట్లాడుతూ ఉండేవాళ్ళం."

"ఆవిడన్న మాటకి ఏదో పురాణగాథ ఉన్నట్టు తోస్తుందే."

"మరేం లేదు."

శివరాం నవ్వుతూ "స్నేహితుడి దగ్గరకూడా పెద్ద దాపరికంటోయ్! నీతో ఆవిడ ఇంత ఫ్రీగ ఉండడం నాకే ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు.

"పూర్వం ఒకసారి మన చెయ్యి ఆవిడ బుజంమీద పడ్డదిలే."

"ఐసా బోలో! అందుచేతే అలా అంది."

"పోనీ అనుకోనివోయ్. మన కేమిటి."

"అరే! ఆడది అలాంటి మాట అంటే నువ్వు ఊరుకునే ఘటం కావే."

"ఏం జేస్తాం."

"నిద్ర వస్తున్నట్టుందే. వరండాలో పక్క వేసుంది పడుకో" అన్నాడు శివరాం లేస్తూ.

"అచ్ఛా!"

౬

పడుకున్నాడే కాని నీలకంఠానికి నిద్ర పట్టలేదు. పక్కమీద అటూ ఇటూ పొర్లాడు. తాయారమ్మ అన్న మాట తేనెపట్టుమీద దెబ్బ వేసినట్టుయింది. అతని మనస్సులో వివిధ భావాలు చెలరేగినవి.

అడుగు పెట్టాడో లేదో అప్పుడే కొత్త సంఘర్షణ! నలుగురిలో తనను ఆవిడ ఆ మాటంటే ఊరుకోవడమా?

ఊరుకుంటే నామోషి. పొగవాడికి అప్పు డప్పుడు వెర్రి పౌరుషం వస్తుంటుంది. అయినా నాలుగు రోజులుండి పొమ్మేవాణ్ణి నాకెందు కనుకున్నాడు.

తొమ్మిది దాటింది. ఒకసారి లేచి నీలకంఠం అటూ ఇటూ పచారు చేశాడు ; మంచంమీద కూర్చున్నాడు. మళ్లీ లేచాడు. ఇంట్లో స్నేహితుడు పడుకున్నాడో లేదో అని అనుమానించాడు, చివరకు వీధితలుపు చప్పుడు కాకుండా తీసి వీధిలోకి వెళ్లాడు. నిర్మానుష్యంగా ఉంది. అటూ ఇటూ చూసి తాయారమ్మగారి తలుపు చల్లగా తట్టాడు.

ఆచార్లుగారు ఊళ్ళో ఉన్నారో లేదో అతను అడగడం మరిచిపోయాడు. ఊళ్ళో ఉంటే ఈ పాటికి ఇంటికి రాకుండా ఉంటాడా ? ఇంట్లో ముసలమ్మ లేకుండా ఉంటుందా ? ఈ సంశయాలతో నెమ్మదిగా తలుపుతట్టాడు.

చప్పుడు వినపడి ఆమె వచ్చి తలుపు తీసిందా సరే! ఒకవేళ ఆయనే వస్తే పూర్వపరచితుడు కాబట్టి యోగక్షేమాలడిగి తప్పించుకో వచ్చు ననుకున్నాడు. కాని సమాధానం రాలేదు. ధైర్యం చేసి కొంచెం గట్టిగా తట్టాడు. రెండునిముషాలాగి చూసినా ఎవరూ రాలేదు. అప్పు డతనికి ఒకఊహ కలిగింది. ఆవి డన్న మాటలు సాభిప్రాయం కావేమో! క్రియ సున్న అనడం ఉపస్కార వాక్యం ఏమో! తనలో తాను నవ్వుకున్నాడు. ఐనా ఏసంగతీ మర్నాడు తేల్చుకో వచ్చు ననిపించింది. ప్రస్తుతం విరమించడం ఉత్తమ మని వెళ్లి పడు

కున్నాను. ప్రయాణపు బడలికవల్ల గాఢ నిద్రపట్టవలసిందే, కాని నీలకంఠానికి ఆ రాత్రంతా కలత నిద్ర. చాలా చాలా కలలు వచ్చాయి. తాయారమ్మ తన దగ్గరకు వచ్చి క్రాపు దువ్వినట్టూ, ముద్దుపెట్టుకోబోతే ఫ్రెంచికట్ మీసం గరుగ్గా తగిలేసరికి మీసం తీసివెయ్యమన్నట్టూ కలగన్నాడు. మరోసారిస్వప్నంలో, ఆమె మంచం మీద వెల్లకిలగా పడు కున్నట్టూ, ఆమె తనను కౌగలించుకోబోయినట్టూ, తాను కొంచెము దూరాన నిలుచుని నవ్వుతూ అసత్యకంఠార్పిత బాహుబంధనా అన్నట్టూ భావించాడు.

ఉదయం శివరాం లేచి, స్నేహితుణ్ణి లేపాడు.

ఓ అని లేచి "టైమెంతయింది?" అన్నాడు నీలకంఠం.

"ఎనిమిది దాటింది. కాఫీ - కాదు టీ - చల్లారి పోతూంది, లే."

నీలకంఠం ఒళ్లు విరుచుకుంటూ లేచి "వేగిరం పళ్లు తోమేసుకుంటా. టీ టేబిల్ మీద పెట్టు, వస్తాను." అన్నాడు. శివరాం అతని ముఖంకేసి తేరి పారచూసి, "కశ్చిజ్జాగర జాత గానసద్వంద్వః, ప్రభాతే శ్రియం బిభ్రత్ గా ఉందే నీ వ్యవహారం! రాత్రి ఏమన్నా గ్రిధం నడిచిందా?" అన్నాను.

"కుచ్ భీ నహీఁ" అని నీలకంఠం నవ్వి కదిలాడు.

"దాస్తున్నావు!"

"నీ దగ్గరనా?"

నీలకంఠం భోజనానికి పూర్వం దొడ్లోకి స్నానానికి వెళ్ళాడు. అక్కడ కుర్చీపీట వేసి ఉన్నది దానిమీద కూర్చుని నాలుగు చెంబులు నీళ్ళు పోసుకుని, ఒళ్ళు తోముకోడాని కని లేచి సబ్బుబిళ్ళ పెట్టికోసం సమీపంలో ఉన్న కిటికీ దగ్గిరికి వెళ్ళాడు. కిటికీ కొంచెం ఎత్తున ఉంది. గాలికి ఒక రెక్క కొద్దిగా తెరచికొని ఉన్నది. పెట్టితీయడంలో కిటికీ లోంచి యాదృచ్ఛికంగా అతని దృష్టి అవతలవేపున పడ్డది. సరిగ్గా ఆక్షణంలో తాయారమ్మ కూర్చుని స్నానం చేస్తున్నది. అతనికి ఒళ్ళు జల్లుమంది. సామాన్యంగా అందరు ఆడవాళ్ళ లాగే ఆమెకూడా నగ్నంగా స్నానం చేస్తున్నది. నీలకంఠం చప్పున మొహం ఇవతలికి తిప్పుకొని వచ్చి ఒళ్లు తోముకో వడం మొదలు పెట్టాడు.

ఒళ్ళు తోముకుంటున్నాడే కాని అతని మనస్సు గోడ దాటి వెళ్ళింది. ఒకగోడ దాటడం ఏమిటి? మహోన్నత పర్వతాలూ, గంభీరసముద్రాలూ, విశాల ఆకాశాలూ కూడా క్షణంలో దాటి వెళుతుంది మనస్సు. వెనకటి రాత్రి ఆవిడన్న వాక్యం మళ్ళీ జ్ఞప్తికి వచ్చి, అతని మానస సరోవరాన్ని కలిచింది; తత్క్షణం తుపాను రేగింది. ఒళ్ళు తోముకుంటున్న వాడు ఆగి కిటికీలోంచి ఆమెను చూద్దామనుకున్నాడు. ఏమిటీ పని అని మనస్సులోనే మందలింపు బయల్దేరింది. తాను రాత్రి తలుపు తట్టినప్పుడు ఏమీ జవాబు రాలేదాయె. ఇప్పుడైనా తెప్పించాలనే పట్టుదల ప్రబలమై అతన్ని కిటికీ దగ్గిరికి నెట్టుకు

పోయింది. చివరకు లొంగిపోయాడు. తీరా వెళ్ళి చూసేసరికి ఆమె స్నానం అయిపోయి లోపలికి వెళ్ళిపోతుందేమో అని దిగులు పడ్డాడు. ఏమైతే నేమి చివరకీ కిటికిలోనుంచి తొంగి చూశాడు.

ఆమె ఇంకా స్నానం చేస్తూనే ఉన్నది. స్నేహితుడు గాని అతని భార్యగాని వస్తున్నారేమో నని నీలకంఠం వెనక్కి తిరిగి చూశాడు. ఎవరూ రాలేదు. పైగా అతనికి మందారం, కరివేపమొక్కా, జామి చెట్టూ, అడ్డం ఉన్నాయి. సావకాశంగా కన్నులకరువు తీరేటట్టు తా నారమ్య తనూశ్శోభ దర్శించాడు.

ఆవిడ కేశపాశం మెలిచి ముడి వేసుకుంది మెడలో గొలుసు, "గ్రీవాలంకృతిపట్టహారలతయా స్పృష్టే కియల్లంబనా, భ్రాజిష్ణుంకవరేఖయేవ నివసత్సింగార సౌందర్యయా" లాగ ఉంది. అతని దృష్టి వాహిని వెన్నుపూస వెంట చల్లగా దిగజారి, ఇసుక తిన్నెల్లో అంతర్వాహిని అయిపోయింది. మన్మథుడు మంచివాడు కాడు. ఆనీలకంఠుణ్ణే ఆందోళన పెట్టినవాడు, ఈనీలకంఠాన్ని ఏమి చేయకుండ లేడు! తాను ఆమెను ఆస్థితిలో చూసినట్టు తప్పకుండా తెలియజేయాలనే కొంటెతనం ఇతనికి ప్రేరేపించాడు. పక్కనే కిటికీలో కుంకుడుగింజలు పడి ఉన్నవి. రెండు తీసి నీలకంఠం ఆమె మీదికి విసిరాడు. టెన్నిసులో అనుకున్న జాగామీదికి బంతికొట్టే నేర్పుగల నీలకంఠం విసిరిన గింజలు ఒకటి మెడమీద, ఒకటి వెన్ను

కిందా, తగిలివేవి. తాయారమ్మ వెనక్కి తిరిగి అన్నివైపులూ చూసి కిటికీ మీదికి కళ్లుతిప్పింది ; తిప్పి నీలకంఠంముఖం కన బడేసరికి చిరునవ్వు నవ్వి, పెదివి విరిచి. ఒళ్లు కుంచుకున్నది. నీలకంఠం ఇవతలికి వచ్చి——

మజ్జనానంతరము నీవు మండనమ్ము
చేసుకొను వేళ నేను సుస్మేరనయన
జలజముల గాంచుచుందు పార్శ్వమున నిల్చి
విమలభవదీయరమణీయవిగ్రహంబు !

అని పాడుతూ స్నానం చేశాడు.

భోజనానంతరము వాళ్ళు విశ్రాంతిగా కూర్చుని ఇష్టా గోష్ఠి చేస్తున్నారు తాయారమ్మకూడా అక్కడికి వచ్చింది. నీలకంఠం కొంచెం బెరుకుగా చూశాడావిణ్ణి. ఎంత చిరునవ్వు నవ్వినా, నగ్నావస్థలో తన్ను చూసినందువల్ల ఆమెకు మనస్సులో కొంచెం కష్టం కలుగుతుం దేమో అనుకున్నాడు. కాని, విప్పారిన ఆవిడముఖం చూసేసరికి అతనికి ఉత్సాహం కలిగింది.

"అక్కగారూ! రండి, కూచోండి" అని అన్నపూర్ణ అరుగు చూపించింది.

"చిట్టిబాబు ఏడీ ?" అన్నది తాయారమ్మ.

"పడుకున్నాడు."

"అయితే చిట్టిబాబుకి ప్రస్తుతం పేరులే దన్నమాట. ది గ్రేట్ నేమ్‌లెస్" అన్నాడు నీలకంఠం.

"మీకు పిల్ల లంటే ఇష్టమేనా అండి?" అన్నది శాయారమ్మ.

"ఇష్టం లేకేం? ఎత్తుకోవడం మట్టుకు చేతకాదు"

"పుడితే, అదే చేతనవుతుంది."

"మరి... మీ కేమన్నా... సంతానం?"

"ఇంకా లేదు" అన్నది అన్నపూర్ణ.

చదువుతున్న పత్రిక కిందికి వంచి "పిల్లలు పుట్టీ ఏడిపిస్తారు, పుట్టకా ఏడిపిస్తారు" అన్నాడు శివరాం.

ఇండియాలో ముప్ఫయిమూడు కోట్లు. పదేళ్ళపాటు అంతా వివాహాలు మానేశో, అధమపక్షం పిల్లలు కనడం విరమించో ఉంటే, దేశం బాగుపడుతుంది. పదికోట్లన్నా తగ్గుతారు.

"అసంభవం. ఎన్నడైనా జరుగుతుందా ఇలాగ?" అని స్నేహితుడి మొహంకేసి చూశాడు శివరాం.

"క్రీస్తుశకం మొదటి శతాబ్దిలో, క్రిష్టియన్ ఫాదర్స్ పదేళ్ళ పాటిలా చేశారు."

"పిల్ల లంటే ఇష్ట మంటిరి. మళ్ళీ ఇదేమిటి?" అన్నది శాయారమ్మ.

"దేని కదే- ఏనా పిల్లలు, మాతృయావన వనచ్ఛేదే కూరాః- అంటేపిల్లలు పుట్టి తల్లులయావనం హరిస్తారు." అందరూ నవ్వారు.

"ఏమండీ తాయారమ్మగారూ! మీ మొహంకంటే వీవు మరీ పచ్చ నేమండీ?"

"కామెర్ల కళ్లకు ప్రపంచమంతా పసుప్పచ్చగా కనిపిస్తుందిట" అని నవ్విందామె.

"ఎలా తెలిసిందోయి?" అని స్నేహితుడి ప్రశ్న.

"ప్రత్యక్ష అనుమాన ప్రమాణాలు రెండూ ముఖ్యమైనవి. భోజరాజుగారు చిత్రకారుణ్ణి పిలిపించి భార్య ఆకృతి చిత్రించ మన్నాట్ట. బొమ్మంతా అయినాక కాళిదాసు చూసి తొడమీద పుట్టుమచ్చ వేయించాట్ట. రాజా మహా కోపంతో కవిని పిలిపించి రాణితొడమీద పుట్టుమచ్చ ఉన్నట్టు నీ కెలాగ తెలుసు? అని గర్జించాట్ట ఆ దాస్వామీ! దేవిగారు పద్మినీ జాతి, కాబట్టి తప్పకుండా మచ్చ ఉంటుం దని చిత్రించ మన్నాను అన్నాట్ట కాళిదాసు. రాజు సంతోషించి నవ్వాట్ట.

అన్నపూర్ణ ముఖం అవతలికి తిప్పుకుంది. తాయారమ్మ ఉత్సాహంతో చిరునవ్వు నవ్వింది.

"ఏమండీ! అన్నట్టు ఆచార్లుగారిని చూడలేదు. ఊళ్లో ఉన్నారా?"

"రాత్రి ఉన్నారు, ఉదయమే వెళ్ళారు. రేపో ఎల్లుండో వస్తారు."

"మీకు గాఢనిద్రా అండి, తెలిగ్గా మెళుకువ వస్తుందా?"

" ఒకప్పు డలాగు, ఒకప్పు డిలాగు " .

ఇంతలోకి చంటివాడు నిద్రలేచేసరికి తల్లి గదిలోకి వెళ్లింది.

" రాత్రి మీారు బాగా గాఢనిద్ర పట్టినట్టు తోస్తుంది"

శివరాం పత్రిక ముఖానికి బాగా అడ్డంపెట్టుకుని ఆవిడ ఏ మంటుందో అని ఆదుర్దాగా ఉన్నాడు.

" పడుకోక ముందు బాగా మెలుకువగానే ఉన్నా తర వాతసంగతి చెప్పలేను. మా ముసలమ్మ మాత్రం వీధి తలుపు ఏమిటో చప్పు డవుతున్నదే పిల్లాఅంటే, గాలిలే అన్నాను."

" అ లా గా ! "

నీలకంఠం లేచి పళ్ళబుట్ట తెచ్చి " మీారు కాసిన్ని స్వీకరించాలి కొంతమందిని రిక్తహస్తాల్తో చూడకూడదన్నారు పెద్దలు. ఇంతవరకూ మరిచిపోయినందుకు క్షమించాలి. " అన్నాడు.

" మరు పనేది నీకు మాట్లోగా " అన్నాడు శివరాం.

" ఎందుకు లెండి. మాటన్నారు చాలు, " అని తాయా రమ్మ లేచి హాల్లోనుంచి పెరట్లోకి వెళ్ళింది. శివరాం పత్రిక చదువుతూనే ఉన్నాడు. నీలకంఠం నెమ్మదిగా ఆమె వెంట వెళ్లి వెనకనుంచి " వద్దనకూడదండీ, పుచ్చుకోవాలండి " అంటూ చేతులు చాపాడు. ఆవిడ రెండడుగులు ముందుకు వేసింది. అతను ఎడంచెయ్యి ఆమె ఎడం పక్కగానూ, కుడి చెయ్యి కుడిపక్కగాను పోనిచ్చాడు. మందారం చెట్టు అడ్డు

వచ్చింది. "స్వీకరించాలి" అని బుజ్జగిస్తూ ఆవిడ చేతుల్లో బలవంతాన పళ్ళు ఉంచాడు.

"ఎందు కండీ..."

"నయం" అని ఒక ఆపిల్ ఆమెనోటి కందించాడు. ఆమె పళ్ళు ఝల్లుమంది. పక్కకు తిరిగే సరికి ఆమె చెక్కిలి ముద్దుపెట్టుకున్నాడు నీలకంఠం. తాయారమ్మ కిటికీ కేసి చూసింది.

"ఈ వేళ రాత్రి బండమీద పోవనుకుంటాను" అని వెనకనుంచి ఆమెను కౌగిలించుకున్నాడు. ఆవిడ మెల్లిగా "అన్నపూర్ణమ్మగారు చెట్టవతల ఉన్నట్టుంది," అని ముందుకు సాగిపోయింది. నీలకంఠం చప్పున ఆగి మందారపూవు ఒకటి కోస్తూ జాగ్రత్తగా ఆకుసందుల్లోనుంచి చూశాడు. అన్నపూర్ణ కనబడలేదు. తప్పించుకు పోవడానికి ఆవిడ వేసిన ఎత్తేమో అనుకుని ఐనా అంగీకారసూచనకు మనసులో సంతోషించాడు.

అతను లోపలికి వచ్చి కూర్చున్న తరవాత శివరాం అతని ముఖం తేరిపారచూసి "ఆమెకు పళ్ళిచ్చావ్" అన్నాడు.

"ఆఁ!"

"ఆవిడని పెరట్లో ఆట ఆడించినట్టున్నావే?"

"లేదు లేదు. పూర్వచనువునుబట్టి కొంచెం చొరవగా పళ్ళు చేతి కిచ్చాను."

"ప్రతిఫలం ఏ మన్నా ఉందా ?"

"నీవు భగవద్గీత పారాయణ చేస్తూంటావే. నిష్కామ్య కర్మ స్వరూపం అవగతం కాలేదూ మా ఫలేష్వుకదాచ న."

ఇద్దరూ నవ్వుకున్నారు.

"ఒక సంగతిరా అబ్బీ! తాయారమ్మ అస్తమానం నన్ను దృగ్బాణాలతో పొడిచేస్తున్నదోయి—"

"ఒళ్ళు తూట్లుపడిన ట్టేం కనబడదే!"

"నా కెందుకోయి!"

"మహర్షుల లిస్టులో చేరావులే."

"వాళ్ళని తగలేసిరి! ప్రతివాడికీ ముక్కుమీద కోపం, స్త్రీ కనబడేసరికి ఝుడితి..."

"నీవు పొరుగింటామెమీద అంత శీతకన్ను వేయడం భావ్యమా? వనిత తనంత తా వలచి.... ఏమిటి?"

"నేను శుకుణ్ణి కాకపోయినా, భార్య ఉన్నవాడికి పరస్త్రీ వర్జ్యం. ఏమంటావు!"

"అచ్ఛా బాత్! ఆ పంపిణీమీదనే పెళ్లి కానివాళ్లకు పర..."

"అదికాదు. అయితే మీ పనులన్నీ సమర్థించు కోవడాని కన్నమాట."

"నేనెప్పుడూ సమర్థించుకోడానికి ప్రయత్నించను. ఏదేనా చెయ్యదలుచుకుంటేచేస్తాను. లేదా ఊరుకుంటాను."

ఇంతలోకే అన్నపూర్ణ చంటివాణ్ణి ఎత్తుకు వచ్చింది తండ్రి కుమారుణ్ణి తీసుకుని ఆశీస్తూ కూర్చున్నాడు. నీలకంఠం "శాస్త్ర వెన్ను వాలుస్తానోయ్," అని వెళ్ళి పడుకున్నాడు.

కొంతసేపటికి అన్నపూర్ణమ్మ నెమ్మదిగా భర్తతో "ఒక తమాషా చెపితే ఏమిస్తారు ?" అన్నది.

"చెప్పిందాన్ని బట్టి బహుమానం."

"నీలకంఠం అసాధ్యుడు సుమండీ."

"చాలా సాధువేనే. ఏం చేశాడు ?"

"చాలా సాహసం కలవాడు. తాయారమ్మని——"

"ఏదో చిన్నప్పటి పరిచయం కాబట్టి కులాసాగా మాట్లాడాడు."

"మాటలు కాదండీ——"

"ఏం క్రియలంటావా! అవిడేమన్నా నీతో చెప్పిందా ?"

"ఆవి డెందుకు చెవుతుంది? ఏమో అనుకున్నాను, అనుభవ శాలిలాగే ఉంది !"

"కొత్తగా ఆవిడసంగతి ఏమి తెలిసిం దేమిటీ ?"

"నేను పెరట్లోకి నీళ్ళకోసం వెళ్ళాను. మంచారం మొక్క వెనకాల మనుషుల కాళ్ళు కనుపించాయి."

"నీకు భ్రమ !"

"భ్రమేమిటండీ ! కళ్ళారా చూస్తే! వీరా స్నేహితుడు ఆవిణ్ణి....."

"ఏమి టేమిటి!"

"కౌగిలించుకున్నారు; ఆవిడ దూరుకుంది !"

"ఆశ్చర్యం ! వీళ్లు పాతస్నేహితుల్లా ఉన్నారు."

"ఆవిడకు మూడో నెల. తెలుసునా?" అని అన్నపూర్ణ నవ్వింది."

"చాలా బాగా ఉంది, మంచిమాట !"

* * * *

మూడుగంటలకు నీలకంఠం లేచి స్నేహితుడిదగ్గరికి వచ్చి కూర్చున్నాడు. "అన్నపూర్ణ టీ పెట్టబోతున్న దోయి." అన్నాడు శివరాం.

"వదినగారికి శ్రమెందుకు? నిన్న ట్లాగ ఆచారీకి ఔరత్ వస్తే ఆవిడచేత పెట్టించు."

శివరాం మందహాసంతో నీలకంఠం వీపు తట్టి, "అబ్బ! చూడ వేశావోయి!" అన్నాడు.

"క్యా హువా ?"

"కౌగిలించుకున్నారుటగా ? అన్నపూర్ణ అన్నది."

"చచ్చితిమిరా శివా! సూట్ కేస్ హాల్డాల్ ఇవతల పెట్టు బయలుదేరుతున్నా."

"అహోరించావులే! ఈ మాత్రానికేనా ? నాలుగు రోజులుంటా నంటివే, అప్పుడే ఎలా పోనిస్తాం?"

"వొదినగారిని చూడ్డానికి మొహం చెల్లదు!"

"మహా చక్కగా చెల్లుతుంది. అసలు సంగతి విన్నావా? ఆవిడ మూడో నెల గర్భిణీట."

"ఆచారికీ ఔరత్ !"

"జీ హాఁ"

నీలకంఠం చివాలున లేచి, తువ్వాలు భుజంమీద వేసుకుని, స్నేహితుడు ఎక్కడికోయ్ అంటున్నా వినిపించు కోకుండా, గబగబా పెరట్లోకివెళ్ళి తొట్టిలో నీళ్ళు ముట్టు కోకుండా, గిలకమీద చాద వేసి, నీళ్లు తోడుకుని, వసరాయి స్నానం చేశాడు.

ఇంతలోకే తాయారమ్మ అక్కడికి వచ్చింది. చిరు నవ్వుతో "ఈ పాటప్పుడు స్నానం చేశారేం ?" అన్నది. స్నేహితులు మొహా మొహాలు చూసుకున్నారు. "టీ పెట్ట నాండి ?" అన్నది తాయారమ్మ.

"మీ తిరుహస్తాలకి శ్రమ ఇవ్వడం ఎందుకు ?" అన్నాడు నీలకంఠం.

అక్కడికి వచ్చిన అన్నపూర్ణతో „ ఈసారి -నీలకంఠం గారు ఈ వూరు వచ్చేటప్పటికి పెళ్ళి ఆయి వస్తారు కాబోలు. భార్య దాక్షాయిణేనాండి ! " అన్నది.

" ఆసంగతి చెప్పలేం గాని... నేను మళ్ళీ ఈ ఊరు వచ్చేటప్పటికి మీరు కొడుకుని ఎత్తుకుంటారు కాబోలు. ఏం పేరు పెడతారండీ ?" అన్నాడు నీలకంఠం. ఆవిడ లజ్జ బాగా అభినయించింది.

తాయారమ్మ పాలిటికి ఆరాత్రి శివరాత్రి ఐంది !

# కవి వాక్యం

౧

కాఫీతాగి వరండాలో పడకకుర్చీలో వెన్ను వాల్చి ఆంధ్రపత్రిక చేతపట్టాడు నీలకంఠం. పేజీ లటూ ఇటో తిరగేస్తూండేసరికి వీధిలో గాజులచప్పుడయింది. మొహం పైకెత్తి చూశాడు.

ఆ యువతికి పదిహేడేళ్ళుంటవి. మధ్యమప్రమాణం. కళ్ళు మామూలుగానే కాటుక పెట్టినట్లుంటవి. మొహాన నిరంతరం మందహాసం తాండవం చేస్తుంటుంది. ఆమె నీలకంఠాన్ని చూసినవ్వింది.

అతనికి చప్పున ఏమో జ్ఞాపకం వచ్చింది. ఆ యువతి ముఖం ఇదివరలో ఎక్కడో చూచినట్లు తోచింది. అదివరలో వరసగా మూడురోజుల్నించి ఆవిడ తనను చూస్తూ వెడుతున్నట్లు జ్ఞాపకం వచ్చింది. రోజూ విప్పారిన కళ్ళతో చూస్తూ వెడుతూండేది. ఆపూట నవ్విందికూడాను. పొదలో ఉన్న పులిమీద రాయి వేసినట్లయింది!

నీలకంఠం భార్యను ప్రసవం అవడానికి గుంటూరు పంపించాడు. బాపట్లలో తాను ప్రాక్టీసు చేస్తూండడంవల్ల, కోర్టు ఇంకా మూయక పోవడం వల్ల, అతను గుంటూరు వెళ్ళలేదు. మూడేసిరోజుల కోమారు భార్యదగ్గరనుంచి అతనికి ఉత్తరం వస్తోంది. అతనూ వెంటనే ప్రత్యుత్తరం రాస్తుండే వాడు.

ఇంతలో పోస్టుజవాను వచ్చి కవ రిచ్చి వెళ్లాడు. చిరునామా భార్య దస్తూరీలోనే ఉన్నది. ఒకసారి ఉత్తరం కేసి చూసి, ఇంకోసారి ఆ యువతి వెళ్ళిపోయిన మార్గం కేసి చూశాడు. తరువాత కవరు విప్పి ఉత్తరం చదువు కున్నాడు.

గుంటూరు

"ప్రాణేశ్వరా! 28 మార్చి 19—

ఇక్కడికి రమ్మని ఎన్నిసార్లు రాసినా మీరు రాకుండా ఉన్నారు. మిమ్మల్ని చూడంది నాకేమీ తోచడంలేదు. నేను కులాసాగానే ఉన్నాను. కాని మీరు దగ్గర లేకపోవడం చేత నాకేమిటో దిగులు దిగులుగా ఉంటుంది. అమ్మా నాన్నా కుశలమే. తమ్ముడి పరీక్షలైనాయి. చెల్లాయి కీమధ్య పెళ్ళనుకున్నారు. కాని వచ్చే సంవత్సరం కాని చెయ్యరు.

ఎన్నిసార్లు రమ్మన్నా మీరు రాకుండా ఉన్నారు. కోర్టుపని అట్టే ఎక్కువలేకపోయినా మీరు నన్ను చూడకుండా ఎలా వుండగలుగుతున్నారు? ఆలోచించగా ఎవరి

వల్లోనో పడిపోతున్నారేమో అని భయం వేస్తున్నది. మీరు వెంటనే బయలుదేరి రావాలి.

మీ ప్రియురాలు,
వి. భవాని "

చదివిన నీలకంఠం చిరునవ్వు నవ్వుకున్నాడు. ఇంతలోకే ఆయువతి మళ్ళీ వీధివెంట వస్తూ ఇతని ఇంటిముందు ఒక్కక్షణం ఆగి మందహాసం చేసి ముందుకు సాగింది. నీలకంఠం లేచి నిలుచున్నాడు. వాకిలిగోడ ఎత్తు లేకపోవడం వల్లా, వరండా ఎత్తుగా ఉండడంవల్లా, అతను పొడుగాటివాడు కావడంచేతా, వీధి చాలాదూరం అతనికి కనబడు తూన్నది. ఆమె ఎక్కడికి వెళ్లుతున్నదో ఆవిడ ఇల్లేదో తెలుసుకోవలెనని అతనికి కుతూహలం కలిగింది. ఆవిడని అనుసరించడం ఉచితమా అనుచితమా అని అతను ఆలోచిస్తూ ఉండగానే ఆవిడ పక్కయింట్లోకి వెళ్ళిపోయింది.

నీలకంఠం వరండామీదనే నిల్చున్నాడు. ఆవిడ వాకిట్లోకి వచ్చి ఇతనివైపు కటాక్షవీక్షణం ఒకటి విసరి మళ్లీ వెంటనే లోపలికి వెళ్లిపోయింది.

" ఈ పక్కయింట్లో మనిషే! మనం ఇన్నాళ్ళనుంచీ గమనించక పోతిమే! అనుకుంటూ నీలకంఠం మళ్లీ వెన్ను వాల్చి పత్రిక చేత పట్టుకున్నాడు అక్షరా· పోవడ వేమిటి! అతను ఏమిటో చదువు తున్నా· పచారు అచ్చులోనుంచి పైకి లేచి ఆటాడుతున్నట్టు కనిపించిన ఇంట్లో

చివరపుటలో ఆడబొమ్మ లుంటే చూడడం మొదలు పెట్టాడు. చూస్తున్నాడేకాని అతనిబుద్ధి పొరుగింటి ఆమె మీదికే పరుగిడుతోంది. ఆ ఉదయం అతని మనస్సు మహా ఆందోళనలో పడిపోయింది. భార్య కాపురానికి వచ్చాక ఎన్నడూ అంత తికమకపడి ఎరగడు. నిజానికి మాణిక్యాంబ చాలా అందమైన మనిషి. ఆ బంగారు చాయ, ఆ కోమల మొహం, ఆ కాటుకకళ్ళు, నవ్వితే గుంటలు పడే ఆ చెక్కిళ్ళూ, ఆ చీనాలరంగు కుంకుమబొట్టూ చూస్తే ఎవరికైనా వ్యామోహం కలక్క తప్పదు. వీటికి తోడు మామిడి పిందెల ఖాదీచీరె, జంపరు జాకెట్టూ, పక్క పాపిడీ, చేతిగాజులూ, మెళ్ళో డైమండుగొలుసూ, ఆ చక్కదనాల నడకా నీల కంఠాన్ని తహతహ లాడించి వేసినవి! భార్యా ఊరికి వెళ్ళి చాలాకాలం కావడం, తాను ఒంటరిగా ఉండడం, బ్రహ్మ చర్యక్లేశం కొంతవరకు బాధ పెట్టినవి.

మాణిక్యాంబ మాణిక్యంవలె శోభనీయ వస్తువు తాను శాంతంగా ఉంటే అకారణంగా కదిపింది. దీని సంగతి ఏమిటో తెలుసుకోక తప్పదనుకున్నాడు. ఆమెకు తనమీద నా [illegible]గం కలిగినట్లు స్పష్టమే! అదివరకు రెండు మూడు పెళ్ళనుకున[illegible]స్తూ వెళ్ళినప్పటికీ అదేదో యాదృచ్ఛికం అను ఎన్నిసేకాని ఆపూట మాణిక్యం తనవంక చూచి నవ్వడం కోర్టుపని ఆతిరిగి వెళ్ళేటప్పుడు క్షణం ఆగి మందహాసం చేయ కుండా ఎ, ఇంట్లోకి వెళ్ళి మళ్ళీ వాకిట్లోకి వచ్చి కడకంటి

చూపుతో లోపలికి వెళ్ళడమూ, ఇవన్నీ అనురాగవ్యంజకాలే కాక ఆసక్తి చిహ్నాలని కూడా నీలకంఠానికి స్పష్టమై పోయింది

ఆవేళ కోర్టుకు వెళ్ళవలసినంత జరూరుపని ఏమీ లేదు. అలాగే కుర్చీలో చేరగిలబడి ఏమేమో ఆలోచిస్తూ అరగంట ఉండిపోయాడు. అప్పటికి పనిమనిషి వచ్చి "బాబయ్యా గారూ! నీళ్ళు తోడకుండా వెళ్లా నిందాక. ఇప్పుడు తోడి, బట్ట లారేసి హోటలునుంచి వణ్ణంపట్టుకొస్తా నండీ" అన్నది. నీలకంఠం కుర్చీలోనుంచి లేచి హాల్లోకి వెళ్లి "అమ్మా! ఈ పక్కయింటివా రెవరే!" అన్నాడు.

"తమకు తెలీదాండి బాబూ? ఈ యింట్లో కొచ్చి నెలరోజులు కావచ్చింది కాదండీ?"

"అయినా గమనించలేదే!"

"మీసాలపంతులుగారిదండి."

"మీసాలపంతులంటే? ఆయనకి పేరు లేదూ?"

"పేరేమో నండి; అంతా మీసాలుపంతులుగారే అంటారు."

"ఆయ నేం చేస్తూ ఉంటాడు?"

"ఏదో ఆపీసులో నంటండి, గుమస్తాగా రంటండి."

"నువ్వు వారింట్లో పనిచేస్తూంటావా?"

"చిత్తవం.డి"

నీలకంఠం వరండామీదికి వచ్చి అటూ ఇటూ పచార్లు చేయడం మొదలు పెట్టాడు. కొంతసేపటికి పనిమనిషి ఇంట్లో

నుంచి ,, నీళ్లతోడానండి బాబయ్యగారు ! తమరు స్నానం చేస్తే బట్టలా రేస్తానండి ” అన్నది.

,, ఆఁ! వస్తున్నాను ” అని నీలకంఠం ఉత్తరం, పత్రికా, లోపలికి తీసుకుపోయి మేజామీద పడవేసి ,, చూడమ్మా! మీసాలపంతులుగారింట్లో ఎవరుంటారే? ” అని అడిగాడు.

“ అయ్యగారూ, ఆయనతల్లి ముసలమ్మా, ఆరిభార్య మాణిక్యాంబ గారూ. ”

“ మాణిక్యాంబగారి కేమన్నా పిల్లలా ? ”

“ ఒక పిల్ల పుట్టి పోయింది గాబోలండి ”

“ వయస్సేమాత్రం వుంటుంది ? ”

“ ఆట్టే లేదండి, పదిహేడు పద్దెనిమిది ఉంటాయేమో నండి. మీరు స్నానం చేసేలోగా టిఫిను కాగ్ తోముతానండి. ”

నీలకంఠం వెళ్ళి స్నానం చేసి హాల్లోకి వచ్చి, అద్దం యెదుట నిలబడి తల దువ్వుకొంటూ “ అమ్మా ! ” అని కేక వేశాడు.

పనిమనిషి పలక లేదు. తెల్లషర్టు వేసుకుని వరండా మీదికి వచ్చి మళ్లీ పచారు చేయడం ప్రారంభించాడు. కొంత సేపు అటూ ఇటూ తిరిగేసరికి మాణిక్యాంబ బర్మా ముందు నీలకంఠానికి కనపడ్డది. అతనికి వెర్రెత్తి నట్టయింది. ముని

వేళ్లమీద నిలుచుని అటువేపు చూడ్డం ప్రారంభించాడు. ఇంతలోనే ఆమె అదృశ్యం అయింది.

రెండిళ్ళకు మధ్య తాటాకుదడి ఎత్తుగా ఉన్నది. ఒక అంచున కరివేపచెట్టూ, కొంచెం అవతలగా నాలుగు అరటి చెట్లూ, చివర బాదంచెట్టూ ఉన్నవి. మాణిక్యాంబగారిది రెల్లు కప్పిన పూరిల్లు. ఇవతలగా చిన్న తాటాకు పాకకూడా ఒకటి వేసి వున్నది. ఈ రెండింటి మధ్యగా ఆమె నూతిదగ్గరకు వెళుతున్నప్పుడు నీలకంఠానికి ఆమెముడి కనిపించింది.

వరండామీద నిలుచుని వాళ్ళింటికేసి చూస్తూవుంటే అతను వీధిలో వాళ్ళకి కనపడతాడు. అందుకని అతను పడక గదిలోనికి వెళ్ళి కిటికీలోనుంచి చూశాడు. చూస్తే ఏమీ కనబడలేదు. ఇల్లు అడ్డం వచ్చింది. ఇంతలో పనిమనిషి టిఫిన్ క్యారేజ్ తీసుకొని వెళ్ళిపోయింది. నీలకంఠం వెళ్ళి మంచం మీద పడుకున్నాడు. భోజనం తెచ్చాక అతను పనిమనిషితో, "ఏమే! మీసాలపంతులుగారికి ఎన్నేళ్లుంటాయి?" అన్నాడు.

"పెద్దవారేనండి."

"రెండో పెళ్లా యేమిటే?"

"అవునండి."

"భార్యాభర్తలు అనుకూలంగా వుంటారా?"

"ఏమో నండి. ఆయ నెప్పుడూ ఆఫీసుపని చూచుకుం టూంటారు. అమ్మగారు అస్తమానం ఏదో చదువుకుం టూంటుంది."

"నువ్వు వారింట్లో ఏం చేస్తూంటావు ?"

"ఇళ్లూడవడం, అటుతోమడం, బట్టలుతకడం ఇంకా ఏవేనా చిల్లర పనులూ నండి."

"ఏన్నాళ్లనుంచి చేస్తున్నావు ?"

"ఐదారు నెలల్నుం చండి."

"నీకు జీతం వగైరా సరిగ్గా ఇస్తూంటారా ?

"అమ్మగారు మంచి దండి ; ఇస్తుంది."

"ఆవిడ ఇంట్లో పనిపాట్లు చేసుకుంటుందా ?"

"అమ్మగారొకట్టే చేయక్కరలేదు. అత్తగారు వంట చేసి పెడుతుంది ?"

"నువ్వు ఎప్పుడేనా పోస్టాఫీసుకి వెళ్లి వాళ్ల ఉత్తరాలు పోస్టులో వేశావా ?"

"ఆ! చాలాసార్లు వేశానండి."

ఆపూట నీలకంఠానికి అన్నం సయించలేదు. ఏదో బలవంతాన రెండు మెతుకులు తిని వెళ్లి వరండాలో మకాం వేశాడు.

౨

ఆవేళ నీలకంఠం ప్రాణానికి గంటకు నూటయిరవై నిమిషాలుగా ఉన్నవి. ఎలాగో గడియారం నాలుగు కొట్టింది. క్లబ్బుకు వెళ్ళి టెన్నిసు ఆడదా మని లేచాడు. లేచి దొడ్లో నూతిదగ్గిరికి వెళ్లి స్నానం చేసి వంటయింటి వాకిటిమెట్లమీద

నిలుచుని తల తుడుచుకుంటూ అప్రయత్నంగా దక్షిణంవైపు చూశాడు.

మాణిక్యాంబముఖం కనబడ్డది. అక్కడ తాటాకుదడి కొంచెం ఎత్తు తక్కువ కావడంచేత అమ్మవారి సందర్శనం అయింది. ఆమె గిలకమీాద చావవేసి నీళ్లు తోడటం ప్రారంభించింది. నీలకంఠం తల తుడుచుకుంటూనే ఉన్నాడు.

ఇంతలోకే దాసీది వచ్చి "బాబయ్యగారూ!" అని కేక వేసింది. పనికత్తె రాకపోతే అతను వెంట్రుకలన్నీ వూడే దాకా తల తుడుచుకుంటూ ఉండే వాడేమో!

దాన్నిచూచి "పెందరాడే వచ్చావేమే?" అన్నాడు నీలకంఠం.

"తలుపులు తీసి వుంటే వచ్చాను బాబయ్యగారు. తమరు కోర్టునుంచి పెందరాడే వచ్చారే యివ్వాళ."

"కోర్టుకి వెళ్లలేదే."

"మీారు తోడుకున్నారు: నేను తోడకపోయానా నండీ నీళ్లు?"

నువ్వు ఇప్పుడే వస్తావని నాకేం తెలుసు? వెళ్లి అయ్యరు హోటలులో టీ పట్టుకురా" అని లోపలికి వెళ్ళి ధర్మోఫ్లాస్కు పనికత్తె చేతికిచ్చాడు.

మాణిక్యాంబకు పనిమనిషిద్వారా కబురు చేదామా అని నీలకంఠం అనుకున్నాడు. తాను కామసూత్రాల్లో చదివిన మాతీసంవరణా ధ్యాయం జ్ఞప్తికి వచ్చి యీా దూతికకు

తగిన లక్షణాలున్నయా అని అనుమానించాడు. చూస్తే ఇది ఆట్టే ఉపయోగించే మనిషిగా తోచలేదు. దీనికి పాఠశాల పెట్టి తయారుచేసి పంపించేసరికి పుణ్యకాలం వెళ్ళిపోతుంది. మనస్సులో గుత్తాలు పరుగెత్తుతున్నవాయె. అన్నిటికంటె పెద్ద జంకొకటి వుంది. ఇది వరలో కొన్ని సందర్భాలలో నీలకంఠం తన్ను బాగా ప్రేమించారనుకున్న స్త్రీలవిషయంలో బోల్తా పడ్డాడు. "కామీ స్వతాం పశ్యతి" అనే సూక్తి అతన్ని జాలాకాలంకిందటే మేలుకొలిపింది. అందుచేత తగినంత భావపరీక్ష చెయ్యాని దే మాణిక్యాంబకు సందేశం పంపకూడ దనుకున్నాడు. పైగా ఈవిషయంలో ఇంగ్లీషులో వలె Direct method తగిం దనుకున్నాడు. ఆమెను ఆకర్షించడం యెలా గని ఆలోచన? ఆమెట్లమీద నిలుచుని కరతాళధ్వని చేసి ఆమెచూపు తనవైపు తిప్పుకుందా మనుకున్నాడు.

చప్పుడు చెయ్యటం పెద్దమనిషితరహా కాదని, అలా చేస్తే ఆమెకు తనమీద ఆట్టే గౌరవం వుండదేమో అనీ, ఒకవేళ యెవరికయినా వినపడితే బాగుండ దనీ ఆ ఆలోచన మాని వేశాడు.

తరువాత టీ పుచ్చుకొని టెన్నిసు Racket తీశాడు. క్లబ్బుకు వెళ్ల బుద్ధి పుట్టలేదు. మనస్సంతా మాణిక్యాంబికా, మయం కావడంచేత ఆమెమీదిగా వచ్చే గాలేనా తనమీద

ప్రసరిస్తే చాలని; వాళ్ళదడికి యివతల వున్న దానిమ్మచెట్టు కింద కుర్చీ వేయించుకొని కూర్చుని కూని రాగంతో—

యాంత్యా ముహుర్వలితకంధర మాననం త
దావృత్తవృంతశతపత్రనిభం వహన్త్యా
దిగ్ధోఽమృతేనచ విషేణచ పక్ష్మలాక్ష్యా
గాఢం నిఖాత ఇవ మే హృదయే కటాక్షః.

అని పాడుకున్నాడు.

అతను కొంతసేపు పాట పాడిన తరవాత దడికి అవతల వైపున బంగారుగాజుల చప్పుడు వినపడింది. నీలకంఠం గుండె స్లోవు ఎక్కే మోటారుకారులాగ కొట్టుకుంది.

మాణిక్యాంబకు తనమీద అభిలాష వున్నదని ధైర్యం తెచ్చుకున్నాడు. ఆమెకూడా ఏమైనా పాట పాడుతుందేమో అని గాని, సాభిలాష మైన సంభాషణ యింటో వాళ్ళతో చేస్తుందేమో అని గాని ఆశించాడు.

ప్రతిఫలం కనబడలేదు. గట్టిపరీక్ష ఒకటి చేతా మను కున్నాడు. లేచి వరండామీదికి వెళ్ళి నిలుచున్నాడు. ఆమె కనబడలేదు.

ఇంతలో దొడ్లో నూతిగిలక చప్పుడైంది. నీలకంఠం చకచకా వంట యింటితలుపు తీసి పైమెట్టుమీద నిలుచుని చూచాడు. నీళ్ళు తోడుతున్న ఆమె చేతులూ, ముఖం, బర్తాకి ముడీ కనపడ్డవి.

అతనికి ప్రాణం లేచి వచ్చింది! ఒక నిమిషం సేపు అలాగే నిలుచున్నాడు.

చప్పున అతనికి ఒక ఆలోచన తోచింది. మెట్లు దిగి వెళ్లి, దానిమ్మ చెట్టుదగ్గిరికి పోయి రెండు పువ్వులు కోసి నెమ్మదిగా దడిదగ్గిరికి వెళ్ళాడు. ఆమె యింకా నీళ్ళుతోడు తునే వున్నది. నీలకంఠం అటూ ఇటూ చూసి దానిమ్మ పువ్వు ఒకటి ఆమె మీదికి విసిరాడు పువ్వు వెళ్ళి ఆమె జుట్టుకు తగిలి కింద పడిపోయింది.

ఆమె యేమీ అనకుండా బొక్కెన లాగుతునే వున్నది. నీలకంఠం చేతులో వున్న రెండో పువ్వు మళ్ళీ ఆమెమీదికి విసిరాడు. దానిమ్మ పువ్వు ఆమె రవికకు తగిలి కోణం పట్టు కోవడంచేత క్షణం ఆగి చల్లగా జారి కింద పడింది. చటుక్కు కళ్లతో ఇతనివైపు చూచింది, నీలకంఠం మునివేళ్లమీద నిల్చుని తన ముఖం ఆమెకు బాగా కనబడేలాగు చూచాడు. నాలుగుకళ్లూ కలిసినవి! ఆమె తలవంచుకుని యథా ప్రకారం నీళ్లు తోడి బిందెలో పోస్తున్నది. నీలకంఠం అక్కడే నిల్చుని ఆమె యింట్లోకి వెళ్ళిపోయేవరకూ తాటాకు కొద్దిగా చప్పుడు చేస్తూవున్నాడు. మాణిక్యాంబ అటూ ఇటూ చూసి యింట్లోకి వెళ్ళబోతూ వెనక్కు తిరిగి నీలకంఠాన్ని చూసింది. అతను తన్మయుడయి పోయినాడు. భావ పరీక్ష చాలనుకున్నాడు. మాణిక్యాంబ మనపరమే అని విశ్వసించాడు.

3

మిత్రుడు రామస్వామి నీలకంఠంకోసం వచ్చి వరం డాలో కుర్చీలో కూర్చున్నాడు. తలుపు లన్నీ తీసునై్న. ఎటు వెళ్లాడని లోపలికి రెండడుగులు వేసి కిటికీ లోనుంచి చూసే సరికి అతను దడిదగ్గిర నిల్చునివున్నాడు. ఆరేసివ తువాలు మొదలైనవి ఏమైనా తీస్తూన్నా డేమో అనుకుని ఒకక్షణం నిదానించాడు. కాని దానిమ్మ పూలు విసిరివేయడం కనబడి మళ్ళా యేదో కామినీ గోష్ఠిలోకి దిగివుంటాడని భావించి ఇవతలికి వచ్చి కూర్చున్నాడు. ఇంతలోకే నీలకంఠం తలుపు వేసి వెరండాలోకి వచ్చి "ఏమోయి! రామస్వామి! ఎప్పు డొచ్చావు" " అన్నాడు.

కొంత సేపైంది" అని నీలకంఠంముఖం కేసి సాభి ప్రాయంగా చూశాడు. స్వామి.

"ఏమి టలా చూస్తున్నావు ?"

"దేని కలా అడుగుతున్నావు ?"

"ఆఁ! ఏం లేదు లే."

"ఏం లేక పోవడమేం ? దడిదగ్గర మకాం వేశావుగా!. తాటా కల్లకం నేర్చుకుంటున్నా వేమో అనుకున్నా."

"నీదరితా వేళాకోళం."

"పిల్లి కళ్ళు మూసుకుని పాలు తాగుతూంటే ప్రపంచం తన్ని చూడ లేదనుకుంటుంది"

"నీకేం కనబడ్డది చెబుదూ?"

"ఈ కుర్చీలో దయచేసి జరిగిన సంగతి సవిస్తరంగా అస్త్ర దాముల చెప్పుల్లోకూడా ఎందుకు వెయ్యకూడదు?"

నీలకంఠం కుర్చీలో కూర్చుని నవ్వుతూ "ప్రథమ కబళె మక్షికా పాతః! ఎవరూ చూళ్లేదనుకుంటే నవ్వ్యా తినూరయ్యావు!" అన్నాడు. రామస్వామి కూడా నవ్వి "ఆవిడెవరో కాస్త చెబుదూ!" అని బుజం తట్టాడు.

"మాణిక్యాంబం."

"మాణిక్యాంబంటే విధవా, సధవా, బహుధవా?"

"మాణిక్యం అన్నమాట!"

"తేల లేదు."

"పరకీయ అన్నమాట."

రామస్వామి కళ్ళు పెద్దవి చేసి "నీ కెన్నిసార్లు చెప్పినా పంచదారమీదికి వెళ్ళినట్లు పరకీయమీదికి దూకుతావెందుకు? చివరికి బోల్తా పడతావు సుమా!" అన్నాడు.

"ఈ శ్రీరంగ నీతులు చెప్పడానికేనా యిక్కడికి దయచేశావు? ఈ మాత్రం నాకు తెలియదనేనా నీవనుకోటం?"

" తెలియ దని గాదు. తెలిసే మహాప్రవాహాన బడి కొట్టుకుపోతాడు మనిషి. సద్వాక్యం చెవిని పడుతుంటే శాస్త్ర ములుపు తిరుగుతుం దని మావంటి వెర్రివాళ్ళ భ్రమ."

నీలకంఠం రామస్వామి బుజం తట్టి " వెర్రినాగులూ! అసలు జరిగిన సంగతి గనక వింటే నన్నే వీపు తట్టి సూపారు చేసి రంగస్థలంలోకి సంపిస్తావు నువ్వే!" అని ఉదయం మొదలు అప్పటివరకూ జరిగిన చరిత్ర యావత్తూ వ్రాస కుచ్చినట్టు చెప్పాడు. విని, రామస్వామి ఆమో దిస్తాడనే నీలకంఠం భ్రమ.

రామస్వామి ఎన్ని కులాసాగాకబుర్లు చెప్పినా, ఎంత సరదామని షైరా Born virtuous type. అయితే, అప్పు డప్పుడు నేశ్శ్రయింటికి వెళ్ళి సంగీతం విందాం, అంటూండే వాడు ఆ మాటలనుబట్టి రామస్వామికి అప్పుడప్పుడు తల్లో పురుగు ద్లొలుస్తూ వుంటుం దని మోస పోయినాడు. మోస పోయి నిజవృత్తాంతం యావత్తూ చెప్పేశాడు.

" అబ్బా యీా! నువ్వేమో Practice చేసుకుంటున్న వాడివి. కొంచెం పెద్దమనిషి తరహాగా వుంటే తప్ప మాట దక్కదు. వెనకటి రోజుల్లో అయితే వేశ్యను గాని మరెవ రైనా గాని పెట్టుకోని స్త్రీడనుకు గౌరవం ఉండనిమాట సత్యమే. వాళ్ళెల్లా వున్నా వాట్టీలు కేసులు దాఖలు చేయించ డం, ఫీ ఇవ్వడం కోసమై ఒకటి రెండు రోజులు మకాం వెయ్యడం కూడా సంభవించేది. ఈ కాలంలో స్త్రీడరంటే

లక్ష్యం తగ్గింది. బొత్తిగా నాన్‌కోవరేషన్ వచ్చిందగ్గరనుంచీ మనవని మరీ అన్యాయమైపోయింది! విషయాల్లో కాకపోయినా వయస్సులో నైనా నీకంటె నాలుగేళ్లు పెద్ద సన్యాసిని గదా! ఎందుకు నీ కావిడ? ఇరుగుపొరుగిళ్ళవాళ్ళ జోలికి పోవడం బొత్తిగా ఉచితంగాదు." అని రామస్వామి ఉపన్యసించాడు.

నీలకంఠం ఏమీ మాట్లాడలేదు.

"మీ యింట్లో పురుడు వచ్చిందా?" అన్నాడు రామస్వామి.

ముల్లు గుచ్చుకుంటే కాలు ఎత్తికేసినట్లు చివాలున లేచి నాలుక కొరుక్కుని "ఇంకా రాలేదోయ్! అక్కడికి ఒకసారి రమ్మని ఉత్తరంకూడా వ్రాసింది భవాని. వెళ్తా, ఒకటిరెండు రోజుల్లో" అన్నాడు నీలకంఠం.

ఆ క్షణంలో భార్యకు ప్రత్యుత్తరము వ్రాయ లేదనే సంగతి జ్ఞాపకం వచ్చి బాధ పడ్డాడు. మిత్రునికి కనుబడకుండా తన విచారాన్ని తెలియనియ్యలేదు.

## ౪

రాత్రి తొమ్మిదిన్నర కావచ్చింది. వరండాలో మంచం మీద పడుకుని కూనిరాగంతో పాట పాడుతున్నాడు నీలకంఠం.

"మమ మరణమేవ వర మితి వితథ కేతనా
కిమితి విషహాసి విరహానల మచేతనా
యామి హే క మిహ శరణం సఖీజనవచనవంచితా."

ఇంతలోకే వాకిటితలుపు కొట్టి స్నేహితులు “నీల కంఠం, నీలకంఠం” అని కేకవేశారు. “ఆఁ” అని లేచి తలుపు తీసి “రండి, కూర్చోండోయ్” అన్నాడు.

“కూర్చునేందుకు పీల్లేదు. నీవు తక్షణం ఉన్నవాడివి ఉన్నపాట్ల బయలుదేరి రావాలి,” అన్నారు స్నేహితులు.

“ఏమిటా హడావిడి? సంగతేమిటో కాస్త చెప్ప గూడదూ?”

“తొమ్మిదిన్నర కావచ్చింది. తెర మెత్తేస్తారేమో! వెంటనే రావాలి నీవు నాటకానికి.”

“ఏం నాటకం?”

“సతీ సక్కుబాయి”

“సాంఘిక నాటక మేదన్నా చూస్తాం గాని—”

“అది ఆడినప్పుడు చూద్దువు గాని, ప్రస్తుతం దీనికి దయచెయ్యి. ఆలస్యమైతే మొదటికోర్టు అయిపోతుం దేమో.”

“తొమ్మిదిన్నరకి తెరయెత్తి వేడిశారూ మన నాటక మహాశయులు? పోనీ ఒక రంగ మైపోయినా పోయినట్టే లెండి రాక తప్పదూ?”

“తప్ప దని గవర్న మెంటువారి ఉత్తరువు!”

నీలకంఠం ఉత్తరీయుం వేసుకుని వీధితలుపు తాళము వేస్తూ ఒక ఆలోచన తోచేసరికి “మీరు పదండి, వస్తు న్నాను” అన్నాడు.

స్నేహితులు ముందు సాగిపోయినారు. మాణిక్యాంబ గారి ఇంట్లోకి వెళదా మని అతనికి బుద్ధి పుట్టింది. మంచి నీళ్ళ వంక పెట్టుకుని వెళ్ళడం సబబు అనుకున్నాడు. వాళ్ళ గుమ్మందగ్గరికి వెళ్ళి, "పంతులుగారూ!" అని కేక వేశాడు. అప్పుడే చుట్ట కాల్చి పడుకోబోతూన్న రంగారావు "ఎవరు" అని తలుపు తీసి "ఓహో! నీలకంఠంగారా, ఏం ఇలా వచ్చేశా రేం?" అన్నాడు.

"కొంచెం మంచినీళ్లు కావా లండీ!"

"నీలకంఠంగారికి మంచినీళ్లు తెచ్చియ్యావే - నుంచు న్నా రేం? దయచేయండి లా మంచంమీదకి."

వాళ్ళంతా భోజ నాలుచేసి అప్పుడే పడుకుని దీపం తీసేశారు. చీకటిగా వుంది.

నీలకంఠం కంఠస్వరం వినగానే మాణిక్యాంబకు గుండె దడదడ లాడింది. భర్త మంచినీళ్ళు తెమ్మని చెప్పగానే ఉత్సాహంతో లేచి "ఇదిగో! తెస్తున్నా" అన్నది.

"అంతా పడుకున్న ట్టున్నారు. పాపం, శ్రమ కలిగించిన ట్టున్నాను. క్షమించాలి!" అన్నాడు నీలకంఠం.

"మంచి నీళ్ళివ్వడంకూడా పెద్దశ్రమా?" అంటూ మాణిక్యాంబ పెద్దయింటితాళం తీసింది.

"వా రెవ రండీ?" అన్నాడు నీలకంఠం.

"మా అమ్మగారు."

